# పీఠిక

ఈగ్రంథము నేవిధమున నాలోచించినను నూతన కవితాసృష్టిగనే యెన్నఁబడును. క్రొత్తఋతువునఁ గ్రొత్త సువాసనల వెదచల్లుచు బయల్వెడలుచున్న సుమరాజములలో నిది యొకటి. కవిమానసము ప్రథమవికాసము నొందుతఱి నుదయించిన భావసుమ మీగ్రంథరూపముఁ దాల్చెనని కవి పలికినపలుకులు యథార్థములు :—

"ప్రబంధరచనారంభకాల
మందు కల్గుకలంత లటుతొలఁగ నవ్య
విలసదుల్లాసముల వెలుఁగొందుభవ్య
కవివిపులమేధావికాసంబు లీల."



కట్టుబాటుల కాఠిన్యమునకు విసిగియు వానియావశ్యకతను గ్రహించి కొంతస్వాతంత్ర్యము గైకొని ప్రత్యేకత్వమును గనపఱచుచుండుటచేతనే కవిప్రయత్నము హృద్యమై మనస్సును హరించుచున్నది.

తెనుఁగువాఙ్మయము సంస్కృతవృత్తములయు భావములయు మోహమునకు లోనయి కదలమెదలలేకున్నప్పుడు, స్వతంత్రకవులు బయలువెడలి దేశీయగానముల యాత్మసౌష్ఠవమును వెలిపుచ్చుచు, నిజరూపభావసౌందర్యములు చెడిపోకుండునటు నూతనపథములఁ ద్రొక్కుచుండుట సారస్వతసంప

దాయము. ద్విపదకావ్యము లట్టి స్వాతంత్ర్యేచ్ఛను వెల్లడించు
చున్నవియై యున్నవి. కాని, యివియును లక్షణకర్తలచేతులఁ
బడి కొత్తశృంఖలముల నేర్పఱచుకొనినవి. లక్షణకర్తలవుఁ
దమయుచితస్థానముల నప్పుడప్పుడు చూపుచుండినఁ గాని వారి
యుద్రేకము హెచ్చగుచుండును. కావుననే యీ 'సుమబాలఁ'
బోలిన నూతనకావ్యములు బయలుదేరవలయును.

మూఁడింద్రగణములును నొక సూర్యగణమును గలిగి, మూఁడవగణము మొదటియక్షరము విరతిస్థానమైయుండి, ప్రాస కలిగిన రెండుపాదములు కలసి ద్విపద యేర్పడుచున్నది. ఈ ప్రాస లేకుండ నెన్నియేని పాదములు కలది మంజరీద్విపద. ఈకావ్యము మంజరీద్విపదలో వ్రాయఁబడి యున్నది. కాని, యొకవిశేషము. ఇంద్రగణములలోని 'నగ, ర, త, నల' ము లైదుమాత్రలు కలవియైయుండ, "నల" మును 'భ' గణమును నాల్గుమాత్రలనే కలిగి యున్నవి. ఐదుమాత్రల గణముల మధ్య నాల్గుమాత్రల గణము తెగిపోయి సొట్టపడినట్లు కనిపించును. నడక సరిగనుండదు, చెవి కడ్డము వచ్చుచుండును. కావున నీ 'భ' గణ 'నల' ములకు మఱి యొక లఘువుఁ జేర్చుటచే శ్రుతిమనోహరముగ నుండును. అందుకొఱకే కర్ణాటచతుష్పదలో నన్నియు నైదుమాత్రల గణములుగ నేర్పాటు చేసికొనియున్నారు.

ప్రస్తుతగ్రంథమున సాధారణముగ మంజరీద్విపదయు, కర్ణాటచతుష్పదయు లక్షణములు సమ్మేళనము చేయఁబడి

యున్నవి. "ప్రఖ్యాతయశుఁడు శివపాదశేఖరుఁడు" అవ. 4. మొదలగు పాదముల 'లలల' ములును, "దక్షిణాపథమందు తంజనగరమున" అవ.5. మొదలగు పాదములందు 'భలఘువు'లును గానగును. ఇట్లయిదు మాత్రల గణములే సర్వసాధారణముగఁ గాన్పించుచున్నను, పూర్వకాలపు మర్యాదను మఱచిపోలే దనుట కక్కడక్కడ నాల్గుమాత్రల గణములను గూడ కవి వాడియున్నాఁడు. ఉదా. "ప్రాణంబు దీయక పట్టియా విభుని." అవ. 28. కాని యిట్టి ప్రయోగములు క్వాచిత్కముగనే యున్నవి.

ఇందు పాదముల గమనిక యడ్డులేక యొప్పుచున్నది. దీనికిఁ గారణము "ఊత" లేనివర్ణములతో గణముల నారంభింపకుండుటయే. సాధారణముగఁ బ్రత్యేకపదములతోడనే గణము లారంభమగుచుండును. తెనుఁగులో పదముతొలియక్షరము మీఁదనే యూతయుండుట తఱచు. అప్రధానపుటూతగలవర్ణములును గణారంభమున నుండిన నుండవచ్చుఁ గాని, యూతలేని వర్ణములతో గణారంభముఁ జేయుటవలన చెవికింపు కలుగదు. అట్టిగణము లీ గ్రంథములో లేకపోవుటయే గాక యప్రధానపుటూతతో నారంభించిన గణములును జాల తక్కువగనే యున్నవి. పూర్వకాలపుఁ గావ్యములలోఁ గూడ నీ నియమము గల పద్యపాదములే కుంటు పడక నడచుచుండు

టను గ్రహింపవచ్చును. కాని, యెల్ల కవులును నీ నియమ
ముపై నంతగ దృష్టినుంచరైరి.

ఇట్ల ద్విపదకావ్యములం దొక యాచారము కలదు. ఒకపాదములోని మాటగాని యూహగాని తెగి, తరువాతి పాదములోనికి సంక్రమింప కుండును. దీని నొకనియమముగా లాక్షణికులు నిర్దేశింప లేదు కాని, కవుల యభిప్రాయము మాత్ర మట్టిదై యుండెనని చెప్పవచ్చును. ఈ యభిప్రాయ ము నిటీవలివా రొక నియమముగనే యెంచికొని, పూర్వలాక్షణికు లేర్పఱుపని క్రొత్త కట్టుబాటు నొకదానిని తెచ్చికొను చున్నారు. ద్విపదకావ్యములం దీ నియమము సాధారణముగఁ బాటింపఁ దగినదియే యైనను గొన్నిచోట్ల దీని నతిక్రమించు టయే యందము నిచ్చును. వలయుచోట్ల గ్రంథకర్త యిట్టి పాదముల నుపయోగించి యున్నాఁడు.(చూ- చెఱ. 184-189; ముప్ప. 134-138.)

గ్రంథములోని భాషనుగూర్చి యొకమాట. సాధారణ ముగ నిం దర్థరహితములగు పదములు కానరావు. భావము లను జిత్రించి, రూపములను గనులయెదుట నిలుపునదియే కవిత్వభాష. భావప్రకటనమే ముఖ్యముగ నెంచి కవి మనలను నిరర్థకవాగ్జాలముచేతనే తృప్తి పఱుపఁ జూడలేదు.

భాషయు ఛందస్సును రసపోషణముఁ జేయని చో నిరు పయోగములు. కవితకు రసము ప్రధానము. రసము భావము నాశ్రయించి యుండును. భావమునకు కథాచమత్కృతి యాధారము. కథాచమత్కృతి పాత్రముల గుణములఁ బట్టి యేర్పడును. "కేవలకల్పనాకథలు కృత్రిమరత్నములు." ఆర్య సత్కథలు పుట్టురత్నములు. కల్పనలంగూడిన యార్యేతిహాసములు సానలు తీరిన జాతిరత్నములు. ఇందలి యితివృత్తము ప్రసిద్ధచాళుక్యనృపశేఖరునిఁ గూర్చినది.—

"పుత్రులుఁ బౌత్రులు భూరివిక్రములు
విమలవిచారులు విబుధపోషకులు
పార్వతీపతిపదాబ్జాతతత్పరులు
నుభయకులదీపకులు నుత్తుంగయశులుఁ

జాళుక్యచోళసమ్మేళనోద్భవుల," కాదిపురుషుఁడై యాంధ్రదేశమునఁ జిరకీర్తి శోభమించిన మానధనుని మోహావృత్తాంతము. ఇందు ప్రధానాంశ మితిహాసబద్ధమైనను నుపాంగములు కవిమానసజాతములు. విమలుఁడు కారాగారము నుండి తప్పిం్చుకొనినను వేఱొకరీతిగఁ జోళుని చేతనే యితర బంధములఁ దగుల్కొనియెను. కొన్నిబంధము లొకలేశ స్వాతంత్ర్యనిరోధకములైనను, నవియె మఱియొకతఱి కోరి తెచ్చికొని ప్రేమించినవియై యుండును. చోళుఁడు చళుక్యుని యుద్ధరంగమునఁ బట్టికొనినను, మోహరంగమునఁ బట్టికొని

నను, చళుక్యుఁడు పట్టుపడుట మాత్రము తప్పినది కాదు. అట్లు బంధించిన పాశము కుందవాదేవిసౌందర్యము: 'కనియెఱుఁగని వినియెఱుఁగని,' లావణ్యము. ఆ పాశమును దగిల్చినది సుమబాల యమాయికత్వము, పాటల నేర్చికొనుటయందలి యాసక్తి. కుందవను విమలుని శక్తియాలయమున జతగూర్చినది గాఁడివాని యదృష్టసూత్రము: "భర్త లద్దాని భగవంతుఁ డనియెదరు." విమలుఁడు తప్పిపోకయుండిన, కుందవకును మదురాంతకమ్మకును మువ్వబంతులాటలో పంతములును నలుకలును బుట్టకయే యుండిన, విమలునిపాటలు సుమబాలమూలమున కుందవకు చేరకయుండిన, శక్తియాలయమున సమావేశము కలుగక యుండిన, రాజేంద్రచోళుఁడును విమలుఁడును పరస్పరముఁ దమయభిప్రాయముల వెలిపుచ్చికొనకయుండిన, విమలుఁడు నిజరాజధాని కేగియుండిన— ఏమయి యుండును? ఎవరి కెఱుక? దక్షిణహిందూస్థానమున మాత్రము రాజకము నిలిచి యొకశతాబ్దము శాంతిలేక వేఁగిరాజ్యము వేగిపోవుచునే యుండి యుండునేమో.

సుమబాల నాయకునిమోహగానమును నాయికకు వినిపించినది. నాయికలావణ్యగుణాతిశయముల నాయకునికి సూచించినది. వారిని జతగూర్చినది. వారి పెండ్లివేదికయొద్ద బుద్దిగఁ గూర్చుండి ముద్దుపాటలఁ బాడినది.

J. Seshagiri Rao.
II Class R College Nellore [illegible]

సుమబాలమృదులగానము కవిమానసమున నిండియు
న్నదనుటకు సందియములేదు. విద్యాగురువగుకవి వివిధమాన
సములతత్త్వమును దగ్గఱగఁ బరీక్షించి, యందందుఁగల మార్ద
వమును భావమునఁ జిత్రించికొని, కోమలపదజాలముచేదానికి
రూపమునొసంగి, మోహనగానామృతముచే దానికి ప్రాణము
లఁ బోసినాఁడు. ఈ 'నవకోమలకావ్యకన్యకను' ప్రేమింపఁ
గలవారు ప్రేమింతురుగాక.

రాజమహేంద్రవరము.
10-4-1922.

చిలుకూరి నారాయణరావు,
M. A., L. T.,
*Asst. Lecturer in charge*
*of Languages,*
Govt. Arts College.

# కృతజ్ఞతావందనములు.

---

నాభావమం దుదయించుచుండెడు కవితాంకురముల ననేకవిధములఁ బోషించి వికసన మొందఁజేసిన—నాగురువులు—Principal O. J. Couldrey దొరగారికిని; ఆంధ్రభాషావిషయమున నేను బరిశ్రమ మొనర్ప నారంభించినప్పుడు నాకుఁ బ్రోత్సాహము గలిగించి యుపకారముచేసిన—నాచిరకాలమిత్రులు—బ్రహ్మశ్రీ ప్రయాగ వేంకటరామశాస్త్రిగారికిని; నే నీగ్రంథము రచియించినపిమ్మట దాని నామూలాగ్రముగాఁ జదివి యందలి గుణదోషవిమర్శనము చేసి గ్రంథసంస్కరణమున కుపయుక్తములగు సూచన లొనర్చిన—నాబంధువులు—బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారికిని, మహారాజశ్రీ శ్రీపాద కామేశ్వరరావు పంతులు గారికిని; ఈపుస్తకము ప్రచురణార్హమగునా యని నేను సందేహించుతఱి నాకు మిగుల హెచ్చరిక గలుగఁజేసి గ్రంథమునకుఁ బీఠిక వ్రాసి యొసంగిన—నాప్రియస్నేహితులు—మహారాజశ్రీ చిలుకూరి నారాయణరావు పంతులు గారికిని నా కృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాను.

రాజమహేంద్రవరము,
22—4—1922.

జయంతి గంగన్న.

శ్రీ

వీరేశలింగము

హైస్కూల్

విద్యార్థులకును,

ఉపాధ్యాయులకును,

అనురాగపూర్వకముగా

ఈ పుస్తకమును

అంకితము

చేయుచున్నాను.

గంగన్న.

ఈ గ్రంథమునందలి కథలో వచ్చునవియు,

కథ కనుబంధించినవియు నగు

## పాత్రములు.

---

రాజరాజు—చోళదేశాధీశుఁడు.

రాజేంద్రచోళుఁడు—రాజరాజు కుమారుఁడు—చోళరాజ్యము నకు యువరాజు.

బాదపుఁడు, తాళపుఁడు—చాళుక్యరాజన్యులు.

దానార్ణవుఁడు—చాళుక్యరాజన్యుఁడు.

శక్తివర్మ—దానార్ణవుని కుమారుఁడు.

విమలాదిత్యుఁడు (విష్ణువర్ధనుఁడు)—దానార్ణవుని రెండవ కుమారుఁడు—శక్తివర్మ తమ్ముఁడు.

చోళరాణి—రాజరాజు భార్య—కుందవాదేవి తల్లి.

మధురాంతకదేవి—రాజేంద్రచోళుని భార్య—యువరాజపత్ని.

కుందవాదేవి—రాజరాజు కొమార్తె—రాజేంద్రచోళుని చెల్లియలు.

సుమబాల—ఒక బాలిక.

చోళభటులు, చెలికత్తెలు, ఇతరులు—

P. K. Rao B.Ed.
V. R. College
Nellore

ఓమ్

పరబ్రహ్మణేనమః.

# సుమబాల

## ౧. అవతారిక.

రాజు లందఱిలోన రారాజ తఁడు,
రాజరాజవిభుండు రఘురామనిభుఁడు,
సుగుణసంపన్నుండు చోళభూధవుఁడు,
ప్రఖ్యాతయశుఁడు శివపాదశేఖరుఁడు,
దక్షిణాపథమందు తంజనగరమునఁ 5
బరిపాలనము చేసెఁ బ్రజలు సుఖియింప.
ఆధరిత్రీనాథు ననుఁగు నందనుఁడు,
రాజేంద్రచోళుండు రణవిక్రముండు,
అన్యరాజుల గెల్చి యశము శాశ్వతము
వసుధాస్థలి న్నిల్ప వాంఛ మదిఁ బొడమఁ, 10
చతురంగబలములు సమకూర్చి కదలి,
దాయాదకలహములఁ దడఁబడుచు నున్న
వేఁగిభూములు చొచ్చి పేర్చి, యుద్ధతిని
బాదపతాళప్రముఖచాళుక్య
రాజన్యులను యుద్ధరంగములఁ జెండి, 15
రాజశ్రేష్ఠ

కోపవిస్ఫూర్తి మూర్కొనియె నంతటను
అధికవిక్రముల దానార్ణవాత్మజుల,
ఆశక్తివర్మవిమలాదిత్యవిభుల.
బింకంబు విడువక పెనఁగి పోరాడి
రాసహాయాదరు, లంత నం దగ్రజుండు 20
గాయంబు వడి పోలఁ, గాంచి హతుఁ డయ్యె
నని యెంచి, క్లేశరోషావేశమునను
శాత్రవునిఁ జంపి పగ సాధింతు ననుచు,
పటుభయంకరలీల బవరంబు సల్పి,
దేహంబు రుధిరప్రవాహంబు గాఁగఁ, 25
గనులఁ జీఁకటి గ్రమ్మఁ గర్ణముల్ మ్రోఁగఁ,
బ్రాణావశిష్టుఁ డై పడియె విమలుండు.
ప్రాణంబు దీయక పట్టి యావిభుని
గొనిపోయెఁ జోళుండు, కొనిపోయె బలిమి;
కొనిపోయి నిజపురంబునఁ జెఱను బెట్టె. 30
పాషాణఖచితంబు భటరక్షితంబు,
పతియాజ్ఞ లేక యాభవనంబు చేర
సాహసించినవాఁడు సమయు నెవఁ డైన—
చండశాసనుఁ డతఁడు చాళుక్యవైరి.
చెఱ దాఁటఁ జాళుక్యనరపాలసుతుఁడు 35
స్వాతంత్ర్యములు లేక పవలును రేయి
స్వాంతమునఁ దనదుదౌర్భాగ్యమున, కకట!

పరితపించుట దప్పఁ బని లేక యుండె.
ప్రేమాభిరతుఁ డైనవిభుఁడు రాజేంద్ర
చోళుఁ డాయలవడ్డచొప్పడిగి యిట్టు 40
లేల చిక్కినవానియెడల వర్తించె?
సామాన్యధర్మముల్, సామాన్యవిధులు,
సామాన్య మైనట్టిసానుభూతులును,
రాజులకుఁ దగ వంట, రాజనీతికిని.
అమలవిక్రమముచే నాదిత్యుఁ బోలి 45
సార్థకనాముఁ డౌచాలుక్యశూరు
స్వేచ్ఛానుసారంబు చేయ నిచ్చినను,
ప్రామాదికం బైనపరిభవంబునకుఁ
బ్రతికార మొనరించి ప్రఖ్యాతి గనఁడె?
బోనులోపలఁ బడ్డపోతుసింగంబు 50
ఉరులఁ జిక్కినయట్టియారణ్యమువగిది
నేమి చేయను లేక యిపుడు పడియుండె.
గజెములు విఱిచియో, కన్నమో చేసి,
తలుపులు పెఱికియో, ద్వారపాలకులఁ
బరిమార్చియో, బయటఁ బడిన ఫల మేమి? 55
చెఱ చుట్టియున్నయాచెఱు వెట్లు దాఁట?
ఔర రాజేంద్ర! నీహస్తమునఁ జోళ
రాజ్యమున కెన్నఁడుఁ రాదు మోసంబు;
ప్రీతితోడ విచిత్రరీతి నీగృహము

కేళీధామంబులకు మేలుతిలకంబు 60
దిద్ద నిర్మించి యుదు, దీని నిపు డెలమి,
జలసమావృత మైనసౌధంబు గానఁ,
జెఱసాల చేసిరిత్రిప్పి నేమంబుకొఱకు.
చాళుక్యభిదురాభశౌర్యానలంబు
చెలరేఁగి నలుగడ విజృంభింప కుండ! 65
చెఱు వెట్టులో దాఁటి చేరినను దీర,
మచట సం దిడకక యున్నట్టిహర్మ్యముల
తేఁచుకుక్కల వీఁక రిత్త పుచ్చఁ గను
గందిరీఁగలపుట్టఁ గా దనఁగ జాలి
పరఁగుబంటులకన్నుఁ బ్రామ వశ మగునె? 70
వారి వంచించినను, వంచింపఁ దరమె
వేయి కన్నులఁ జూచు వేగులను? మాయ
వారి వంచించినను, వైరంబుపూని
గోపురాధ్యక్షు లాఘోరనాయకుల
తోడ చెయి కలిపి పోఁ ద్రోయ శక్యంబె? 75

## ౨. కుందవాంబ.

సౌదామిని న్నవ్వ సమకట్టుఁదనువు,
నెలఁతచిఱునవ్వు వెన్నెలల వెదచల్లు,
తఱచైనయిరులమొత్తంబులో నుండి
వేగుఁబ్రొద్దున బయల్వెడలుతొలిదిక్కుఁ
బోలుమొగ మందు నెప్పుడు లక్ష్మి మెలఁగు, 5
తరుణిసౌందర్యంబు దరమె వర్ణింప?
తెలిగల్వఱేకులం దిరుగాడుచుండు
తుమ్మెదలఁ గెల్చుకనుదోయి జిగిపసలు,
పలుకు లవి గావు సతి పతిని మేల్కొలుప
వాయించువీణసిక్వాణముల్ గాని; 10

పదునెనిమి దేండ్లయెల ప్రాయంపుహాయులు,
రాజేంద్రచోళుగారాబు చెల్లియలు,
రాజరాజతనూజ రమణీలలామ,
కుందవాంబాదేవి. కుందనపుబొమ్మ.

కుందనపుబొమ్మవలె కుందవాకన్య, 15
తనుకాంతు లందిందుఁ జని పరుగు లెత్తఁ,
బడకగదిలో నొక్క పటికంపుఁబీఁట
నాసీన యై యుండె నంతిపురమందు.
కుందనపుబొమ్మవలెఁ గూర్చుండెఁగాని
యరమోడ్పుఁగనుదోయి, యరవిచ్చుమోవి, 20

మోవిపై నల్లా తుముద్దు చిఱునగవు,
సంగనిశ్చలతయు, నతినచిత్తంబు
భావలగ్నం బగుటఁ బ్రకటించుచుండె.
కుందనపుబొమ్మవలెఁ గూర్చుండి యున్న
రాచకన్నియ యుల్కి లేచి యాచెంత 25
వాతాయనము చేరి, బయట దూరమునఁ
బాడుచుఁ వచ్చునొకబాలికం జూచి
పాట వినుచు న్నిల్చె బహుశ్రద్ధతోడ.

పాట.

"పారిజాతము భామకొఱకై
శౌరి కృష్ణుఁడు శౌర్య మలరఁగఁ 30
బోరియమరుల మోఁది తెచ్చెను
తెచ్చె దివినుండి!
సత్యభామకొఱకై వజ్రి నోరిచి
స్వామి దెచ్చినపారిజాతం
బీమహిని వర్ధిల్లు నెల్లరు 35
మేలు మే లనఁగా!

మేలు మే లని మేదినీజన
పాళి పొగడెసుభాగ్య మలవడె,
నీలవర్ణుని నిర్ణయంబునఁ,
బారిజాతముకు! 40
పరమభాగ్యము ప్రాప్త మాయెను,

సురుచిరంబు గ సుఖము నొందక,
విరిసినంతనె వీడి రాలుచు
వింతయది యేమో!
వింత గా దొక్కింతయును, బల 45
వంతుఁ డొరులను బట్టి వారల
కెంత గౌరవ మిచ్చినను సుఖి
యింతురే వారు!"
గానంబు ముగిసెనే కాని రాకన్నె, 50
కర్ణముల విన నలవి కానిగానంబు
మనసు రంజిలఁ జేయ, మై మఱచి యున్న
దనునట్లు నిశ్చేష్ట యై యొక్కతడవు
నిల్చి, కన్నులు విప్పి, నిట్టూర్పు విడిచి,
"బాగు బాగమ్మ, సుమబాల, నీబ్రతుకు, 55
నేఁడు మఱియుకపాట నేర్చి వచ్చితివి,
బాల్యంబుకంటె నీఁక భాగ్యంబు గలదె!
ఎందుఁ బోయినఁ గాని యేమి చేసినను,
ఎవరిఁ జేరినఁ గాని యేమి పల్కినను,
నవ్వు వచ్చినవేళ నవ్వినను గాని, 60
యేడ్పు వచ్చినవేళ నేడ్చినను గాని,
తగు ననుచుఁ, దగ దనుచు, ధర్మశాస్త్రములు
చెప్పి తీర్మానముల్ చేయ రెవ్వారును."
అని యిట్టు లనుకొనుచు నారాజపుత్రి

పా న్పెత్తి, యొకతాళపత్రంబు దీసి,
యవ్యక్తకంఠమున నది యేమొ పాడి, 65
మరల నీరీతి గా మదిని దలపోసె—
"పలువర్ణముల మించు పలుతావు లొల్కు
సుమమాల యొక్కటి సుమబాల గ్రుచ్చి
కొనిపోయి చెఱ నున్న జనపాలసుతున
కర్పించుచుండు నట యనుదినముఁ బ్రీతి ; 70
సుమమాలికకు మాఱు చోళశాత్రవుఁడు
పలుస్వరంబుల మించు భావంబు లొల్కు
పదజాలముం గూర్చి పాట రచియించి,
యాబాల కొసఁగు నట యనుదినముఁ బ్రీతి.
తమ పేరు ప్రఖ్యాతి ధరఁ బ్రతిష్ఠింపఁ 75
గాంక్షించి, ధారుణీకాంతు లపు డపుడు
కవుల నాస్థానముల గౌరవము చేసి,
వారిచేఁ గావ్యముల్ వ్రాయించుచుండు
సంప్రదాయం బుంట చాల గా వింటిఁ,
గాని తానే యిట్లు కవనంబు చెప్పఁ 80
బ్రతిభ గల్గినమనుజపతితనయుఁ డుంట
గనుఁగొంటి, హృదయంబు కడు ముదం బందె.

* * * *

సుందరాకారుఁ డని సుమబాల మెచ్చు,
మేటిబంటని యెంతొ మెచ్చు మాయన్న,

సుగుణయుతుఁ డని మెచ్చుఁ జోళభూధవుఁడు, 85
ప్రతిభ యీతాళపత్రములె వెలిపుచ్చు,
నిట్టిసద్వరుఁ డింక నెం దుండు ననుచు
నెల్లవేళల జనని హెచ్చరిక చేయు;
ఏప్రయత్నము గాని యిసుమంత లేక
యన్నివిధముల యోగ్యుఁ డగునీచళుక్య 90
పార్థివసుతుచేయి పట్టుభాగ్యంబు
సంప్రాప్త మయ్యె నే సరె యన్నఁ జాలు;
సరె యన్నమాత్రాన సమకూరు వాంఛ—
సమకూరుఁ, గాని నే సరె యనఁగఁ జాల;
సుగుణవంతుండైన, సుందరుండైన, 95
ప్రతిభాన్వితుండైన, రణశూరుఁ డైన,
విష్ణువర్ధనుఁడు శ్రీకృష్ణసముఁ డైన,
నాఁ గాక—పూరుషునియాంతర్య మెందు
సక్త మైనది యెఱుఁగఁ జాల కున్నపుడు,
సద్వనిత సరె యనఁగఁ జాలు టది యెట్లు? 100
జనకుఁడుఁ యువరాజుఁ జాల యోచించి
చేఁజిక్కినట్టి యీరాజనందనుని
జెఱ వాపి చాళుక్యసింహాసనమునఁ
జేర్తు మని సమయంబు చేసి యొప్పించి,
రాజ్యాంగతంత్రనిర్వాహసాధనము 105
గా నీవివాహంబు గల్పించినారు;

కల్పించినారు, నేఁ గా దనుట నిప్పు
డారాజ్యతంత్రంబు కంతరాయంబు
సంభవించెను, దాన జనని కోపించె;
జనని కోపించినను జనకుఁ డేమనిన—" 110

గంతులు వేయుచు నంత సుమబాల,
"చూడ వమ్మా, నేను జూడ లే దిట్టి
కుసుమరాజం బెందుఁ, గోసితిని దీని
మాయింటితోటలో మల్లెపందిరిని;
యువరాజవిభునితో యుద్ధమున కేగి, 115
చాళుక్యపురినుండి చాల మక్కువను
దెచ్చి మాబావ నాకిచ్చె నొకతీఁగ,
దాని తొలిపూత యిది దీనిఁ గొనవమ్మ."
అని యిచ్చుపువ్వంబు నందు రాకన్నె
పల్కె నవ్వుచు నిట్లు, "బాల, చాళుక్య 120
పురినుండి నీకొక్కపూవులే కావు,
పూసొంపువాసనలఁ బోనాడుపూల
పాట లెన్నెన్ని యో ప్రాప్తించుచుండు.
ఏ దేది, వినఁగ నాకిచ్చ జనియించు,
నేఁడు క్రొత్తగ నీవు నేర్చి యున్నట్టి 125
పాటలే కాకుండ, ప్రాత వియుఁ గొన్ని.
నీపాటలన్నియుఁ నే వ్రాసికొంటి,
వ్రాసికొంటయె కాదు, పాడ నేర్చితిని,

గాని యవి నీనోటఁ గడు నింపు లొల్కు."
"ఔనమ్మ, యెం తెంతొ యాసపడి నేను 130
పాట లె న్నెన్ని యో పాడ నేర్చితిని;
నాపాట లన్నియు, న్నాపడిన యాస
లన్నియున్ గడతేఱ నున్న వనుమాట
గొంచె మైనను జెప్ప కుంటివో యమ్మ,
మీరు వా రనుకొనఁగ వింటినే కాని." 135
ఆదీన మగునెలుం, గాపెదవితొట్రుఁ,
జిన్న వోయినమోముఁ, జెమ్మగిలుకనులుఁ
జూచి పక్కన నవ్వ చోళరాపట్టి—
"ఏమి యాపద వచ్చె, నేల యీావంత,
యేమి దాఁచితి, నిప్పు డేమి వినియుంటి, 140
వెట్టియాసలు పడితి, వెట్టు లవి యన్ని
గడతేఱ,మఱి చక్కఁబడ వలె బాల?"
"నవ్వకమ్మా దేవి, నామన స్సేమి
మనసువలె లే దమ్మ, మఱి చక్కఁ జేయ,
వేఱె సంబంధంబు వెదక నగునమ్మ? 145
ఈబహూళమునఁ గాక యేఁడాదిదాఁక
మూర్తమే లే దఁట ; మొదట నిది యంత
నాకుఁ దెలిసిన నింత రాకుండు నేమొ!
నవ్వ కోదేవి వందనము చేసెదను,
వెడఁగుమాటలు గావు, వినవమ్మ, నీకు 150

జ్ఞప్తియున్నదో లేదో, ఘనవైభవముత
రాజేంద్రచోళయువరాజతిలకుండు
జగమునివ్వెఱఁ గంద శత్రువులఁ గెల్చి,
సకలదేశములందు సత్కీర్తి నిల్పి,
జయలక్ష్మి వెంట రాఁ, జనుదేర నిచట 155
స్వాగతమహోత్సవము జరుగుసమయమునఁ,
గన్యలందఱఁ గూడి గానంబు చేయఁ,
బురిని లేకుంటఁ గోల్పోతి భాగ్యంబు ;
దానికై పల్మాఱు నేను జింతింపఁ,
గనుఁగొని, మహాదేవి కనికరముతోడఁ 160
జేర నన్నొకనాఁడు చీరి, మీ రంత
వినుచుండ నిట్లనెను, 'విలపింపఁదగునె ?
వచ్చుచున్నది వచ్చువైశాఖమాసము
కుందవ వివాహంబు, కోర్కె దీఱంగ,
మొన్న పాడఁగ లేనిముద్దుపాటలును, 165
నింక నేర్చెడిక్రొత్తయింపుపాటలును,
బాలనిన్నొకతెనె పాడ నిచ్చెదను'.
ఆమాట మది నుంచి యాసక్తితోడ
నాఁటినుండియుఁ బూలపాట లెన్నెన్నొ
నేర్చుకొంటిని, దినము నేర్పఁగలయట్టి 170
యావిమలచాళుక్యుఁ డిట కపుడె వచ్చు
టదియు నాభాగ్యమే యనుకొంటిఁ గాని,

వరునిఁ జూడఁగఁ జనిరి బ్రాహ్మణు లఁటంచుఁ
గోటలోపలఁ జెప్పఁగొన వింటిఁ గాని,
యావిషయుఁడే యాస లన్ని చెఱుపంగఁ 175
గారణం బగు ననుచుఁ గల నైన నెఱుఁగ;
కల నైన నెఱుఁగ నీకరణి, లోకమున
రాజ్యముల్ గలయట్టిరాజు లుండంగ,
సిరియెల్లఁ గోల్పోయి చెఱ నున్నయితనిఁ
బిల్చి చోళవిభుండు బిడ్డ నీయంగ 180
సిద్ధపడు నని కాని, సిద్ధపడ నితఁడు,
తనయదృష్టము పండె నని యుబ్బుటకును
మాఱుగా, రారాజుమాట పోనాడి
నాహృదయ మీరీతి నలఁచు నని కాని.
కారాగృహము దాఁటి ఖడ్గంబు పట్టి 185
చంపుటకు నైన నేఁ జచ్చుటకు నైన
నీదుముందట నెపుడు నిల్తునో, యపుడు
పెండ్లిమాటలు చెప్ప వినువాఁడ? ననుచుఁ
బ్రతివచన మిచ్చె నఁట, రాజేంద్రవిభుఁడు
మొన్నటిదినమునఁ బోయి మాటాడ! 190
ఎదుటివారలఘనత యించుకయుఁ గనఁడు,
ఇది చెవులఁ బడినది మొదలు నామనసు
విఱిగి పోయెను, జెఱకు వెళ్ల లేకుంటి—"
ఇట్లు కిచకిచ లాడి, యింక నే మేమొ

పల్కఁ బోవుచు, కుందవాంబవదనంబు 195
గని గ్రక్కతిలి నాల్కఁ గఱచికొని బాల
కంఠస్వరంబునఁ గద్గదిక పుట్ట,
"నే నెంత మతి లేనిదాన నైతి!
చెప్ప వద్దెవరికిని జెప్ప వద్దనుచుఁ,
బెండ్లి యాగినమాట వింటి నని యెఱిఁగి, 200
హాఱి మఱియు బోధించె మధురాంతకమ్మ."
అని హస్తములు మోడ్చి యాబాల మరల,
"అజ్ఞానమునఁ జేసి యాజ్ఞ మీఱితిని,
నాతప్పు సైరించి నను గావవమ్మ,
అన్యులకుఁ దెలియ రా దనుకొంటిఁ గాని, 205
యెల్లవృత్తాంతంబు నెఱుకపడి యున్న
మనయింటిలో నైన ననుకొనం గూడ
దనుమాట మదిఁ దట్టదాయె నోదేవి."

* * * * *

"లే లెమ్మ, సుమబాల, లెమ్మ, నీ కిపుడు
భయ మేమి లేదు, నీపని చూచుకొనుము. 210
పనిఁ జూచికొని వేగ చని చెలులతోడఁ
జెండ్లాట యాదిగము, చెప్పి రమ్మనుము."

## 3. చెఱసాల.

"ఎట్టినక్షత్రములఁ బుట్టితిమొ కాని
తల్లికడుపున నన్నదమ్ములము, మేము
చవి చూచి యెఱుఁగము సౌఖ్య మన నేమొ;
నిల్చినతావున నిల్చుటకు లేక,
కుడిచినతావునఁ గుడుచుటకు లేక, 5
పల్లెల వలసలఁ బట్టణంబులను,
అడవులఁ గొండలఁ బడి తిరిగి తిరిగి,
తుదకు (దాయాదధూర్తులను) జెండాడి,
మారాజ్య మది మేము మరలఁ గైకొనఁగ
నుంటిమి గద, చోళయువరాజ, నీవు 10
మన్ను పోసితివి సిద్ధాన్నంబులోన !
బహుదినంబులనుండి పడియున్న కష్ట
మంతయు నంతలో వ్యర్థ మై పోయె !
మాభాగ్యభోగముల్ మా వైభవములు
నీటిలో నూఁగాడుమూట లైనవిగ ! 15
మాదేశ మెప్పుడు మఱి కంటఁబడునొ !
ప్రజ లెట్టి యిక్కట్లు పడుచున్నవారొ
మమునమ్మి పోరినమా సేనలెన్ని
న్యూనతల పాలైనవో కదా నేఁడు !

సుకృతంబు చేసితివి, సోదరా, నీకు 20
సంగ్రామమరణంబు సంప్రాప్త మయ్యె!

* * * * *

"అట నిరర్గళము లై యతిచిత్రగతులఁ
గలకలస్వనములన్ గగనంబు నతుల
శోభాన్వితము చేసి చూపరులమతుల
హర్షంబు నెలకొల్పునాపక్షితతులఁ 25
జూడఁ జల్లారునాశోకాగ్ని కొంత.
కటకటా! యిటువంటిఖగములం బట్టి,
స్వచ్ఛందవృత్తి నవి సల్పుసంచార
ముల రోసి పంజరంబుల వానిఁ బెట్టి,
చివురుతీవెలమీఁదఁ జెలఁగి యింపారఁ 30
గూడియాడెడువానిఁ గొయ్యలకుఁ గట్టి,
శ్రవణరంజకమనీయతరగానధాం
లను మాన్పి నీరసము లైనట్టివట్టి
మంకుకూఁతలు మప్పి, మాట లని చెప్పి,
కలనెయ్యముల మాపి, కయ్యముల రేఁపి, 35
ద్వేషములు కల్పించి, రోషములు పెంచి,
పోరి వినోదించునాబోఁటిఘాతుకులు
మానవులె వారు, మఱి దానవులుగాక!"
వెయి తెఱంగుల నిట్లు విమలుఁ డానాఁడు
తనదుదుర్దశ యాత్మఁ దలపోసికొనుచు, 40

సకలజంతుప్రాణసంఘములం బైన,
వివిధభూతవ్రాతవిస్తీర్ణ మైన,
బహుళసస్యవ్రాతబంధురం బైన
విపులప్రపంచంబు వీక్షింప నింక
భాగ్య మొసఁగూర్చెడిగవాక్షంబు చెంత, 45
బింకమునఁ గన్నీటివెల్లువల నాఁపి,
శిర సాకించుక యెత్తి, చేతులు రెండు
వెనుక జోడించి, సిగ వీడి వ్రేలాడఁ,
జెక్కిలి దలుపునఁ జేర్చి యొక్కింత,
డాఁపటిఱొమ్ము గోడను మోపి నిలిచె. 50

చలన మేమియు లేనిసలిలంబుతోడ,
సలిలనైర్మల్యవైశాల్యంబుతోడఁ,
దటమునం దున్న శాద్వలరేఖతోడ.
నా చెంతఁ జెంగల్వయరవిరులతోడ,
మడుఁ గొప్పె నాకాశమహిమకె యెదుటఁ 55
బచ్చఱాచట్టమునఁ బవడంపుమరల
నమరిచిన వజ్రంపుటద్దమో యనఁగ.

జాజిపూవులసరులజత నొక్కకేల,
మల్లెపూబంతులను మఱియొక్కకేలఁ,
బట్టి, మూఁపున వ్రేలుబంగారు(సజ్జ)బుట్ట 60
జాజిమల్లెలఁ బొగడసంపెఁగల నింపి,
కన్నె యొక్కతె కొలనిగట్టుపై, నంతి

పురముకై కాఁబోలుఁ, బోవుచును, జిన్ని
చెలువంబు గ్రేవలం జిలుకనెమ్మోము
చాళుక్యుఁ డున్న చెఱసాలదెసఁ ద్రిప్పి— 65

పాట

1. "గగనమ, నీశోభ లేమి గగనము కావమ్మ, మా
కగణిత మగుపుష్పచయములలరుచున్నవవిగోఁజూడు॥గగ॥
జగముల నన్నింటి నొక్కసరణిఁ జూచుధర్మ ముడిగి
భగవంతుఁడు నీకె సౌభాగ్యములను దాఁచఁ గలఁడె॥గగ॥
2. తరమె యెవరి కైన నా ప్రతాపము నెదిరింప ననుచు, 70
గరువముతో నీయందలి ఖరకిరణుఁడు వెలుఁగు, నా
ఖరకిరణజ్వాల లడఁచి నిరుపమవిభవంబుతోడ,
సరసిజములు మాచెంతను జల్లఁదనము లొల్కుఁజూడు ॥గగ॥
3. నలుదిశలను జెలఁగునిరులఁ దోలఁగఁ దోలువార మనుచుఁ,
గిలకిల మని నీదువెన్నెలవెలుఁగులు నవ్వు, నా 75
వెలుఁగు లన్ని మిసిమిఁ బాసి వెలవెలఁ బోవంగ, మా
తెలికలువలు నవ్వుచుండుఁ, దెలిసి దర్ప ముడుగుమో॥గగ॥
4. ఇనచంద్రులు మాత్రమె కా,దిఁక జూడుఁడు నామహిమల॥
కనుచు నాల్గువన్నెల నీ వగపఋతువు సంధ్యలందు,
అనయము మాపుష్పరాసు లమితవివిధదీప్తులతోఁ 80
దనరుచుండు నెల్లయెడల దాఁచికొనుము నీమహిమల॥గగ॥"
పాట పాడుచుఁ బోవుబాల నీక్షించి
మదిలోన విమలుండు, "మఱచిపోయితిని,

ఏలొకో యీబాల రాలేదు రెండు
దినము లాయెను, బూలు తెచ్చుటయు మానె." 85
అనుచు మోమున మందహాసంబు గుదురఁ
దల యూఁచి, "ఇది చోళధరణీవల్లభుని
యాజ్ఞ కాఁబోలుఁ, దా నతికటాక్షమునఁ
బెట్టెడు కళ్యాణభిక్షకై చేయి,
పరమ ప్రసాద మని, పట్టనందులకు 90
శిక్షలలో నొక్క శిక్ష కాఁబోలు!
కాఁబోలు సర్వాధికార మొకచేత,
దుమ్ము వేఱొకచేత, నిమ్ముగాఁ బట్టి
కరమునం దది యుంచి, కనుల దు మ్మిడుచు
సంచరించుచునుండు జయమహాలక్ష్మి!
నాకన్న, రాజేంద్ర, కదనంబులోన
నోడినమాత్రాన నుత్తమాన్వయుఁడు
సహజదర్పము వదలి శాత్రవునికృపకు
నాసించు ననుకొందువా యిట్లు నీవు?
రాజ్యంబు, దేహంబు, ప్రాణంబు నీవి, 100
నాహృదయ మది యింక నాయధీనంబె.

* * * * *

పాట.

1\. కని మెఱుఁగను నాకన్నుల నెపుడు,
విని యెఱుఁగను నావీనుల నెపుడు॥

కని యెఱుఁగను విని యెఱుఁగను, గాంత నీవు పుడమిపైని
జనియించిన దైన నెఱుఁగ, జనియించున దైన నెఱుఁగ॥
కనియెఱుఁగను॥ 105

2. కని యెఱుఁగను నీవదనము, విని యెఱుఁగను నీపల్కులు,
విని యెఱుఁగను నీగుణములవినుతి యైనఁ గాని నే॥
కనియెఱుఁగను॥

3. కని యెఱుఁగను నీవదనము, కనుల యెదుట నీయందమె,
అనయము నీయందమే,
విని యెఱుఁగను నీపల్కులు, వీనుల నీకంఠమె, నా 110
వీనుల నీంకఠమే ;
కని యెఱుఁగను విని యెఱుఁగను, గాంతహృదయమంతనీవె,
కాంత, హృదయమంత నీవె,
కాంత, హృదయమంత నీదె ॥కనియెఱుఁగను॥

4. కనియెఱుఁగను వినియెఱుఁగను, గానినిన్నుఁగనిననాఁడె, 115
కనులఁ గాంచి నీపల్కులు గర్ణములను వినిననాఁడె,
కని విని నీహృదయము గరఁగించిననాఁడె కాని,
కాంత లేదు కల్యాణము,
భ్రాంతి గాదు భ్రాంతిగాదు ॥కనియెఱుఁగను॥"
కలసంపదల నర్థిగణములకుఁ బంచి, 120
దారిద్ర్యమును గన్న దానశీలుండు,
తా నొనర్చినయట్టిదానంబునకును

వగపు నొందక, చూచువా రెల్లఁబొగడ,
తప్పి శేషించువిత్తంబు సంప్రీతిఁ
బాసి యుబ్బుచుఁ బింతవన్నెమై మీఱి 125
భువిని గీర్తులు నిల్పి దివి కేఁగురీతి,
దిన మెల్ల విశ్వమున దీధితు ల్పఱపి,
ద్యుతిదర్పమును దక్కియును సొంపు చెడక,
బింబ ముబ్బఁగ శోణిమస్ఫూర్తి మెఱయ,
నభము కలయంగ నానావర్ణమయము 130
చేసె మార్తాండుండు; చేసి తాఁ గ్రుంకె.
క్రుంకుటయుఁ [illegible]
అదరుటయు, భూతలం బదర, నో యనుచు
మ్రోఁగుసురభేరి యన మ్రోఁగె గర్జితము;
గర్జితము వెన్వెంటఁ గాలాభ్ర మొకటి,
వాయవ్యదిక్చక్రవాళంబు వెడలి,
వచ్చె, ద్రోవ రుక్మిణీవనితఁ గొంపోవ
నెత్తి వచ్చుకృష్ణుఁ డేమో యనంగ;
చేరెడం తది మొదట జీమూత. వార
అంత కంతకు తుణం బగులోనఁ గొలఁది 140
దెగడి, సాగరములం దెరలు తోయంబు
లెల్ల, లోకము ముంప నేకకల్లోల
మై యుపుడు విఱిగి పడ, నంబరంబునకు
నెగసె నన దోఁచి వెస నేతెంచుచుండె;

కృష్ణసర్పముపడగ క్రింద నాకంప 145
మొందుఖగడింభకంబుల పగిది, దవుల
నగరబాహ్యోర్విఁ గన్పట్టుతమవారి
కైనము వీక్షించి యాస విడనాడి,
యింకఁ దమవం తగుట యెఱిఁగి స్మృతి దప్పి,
నిష్కుటంబులఁ దరులు నిశ్చేష్టవృత్తి
నిల్చె; నంతట సకల న్నృపభుజం బదిరె;
అదరుటయు, గర్జితం బౌ ననుచు మొరసె;
గర్జితారావంబు కర్ణములనుండి
తొలఁగ కుండనె, మహోద్ధ్రుతగతిని బేర్చి,
ఝుంకారసంయుతము ఝుంఝూనిలంబు 155
మేడలను మిద్దెలను మేటిబురుజులను
గదలించెఁ బురజనులహృదయములు గలఁగ.
తోయదం బపుడు వెయితునుక లయి, హోరు
మని, పుడమిపైఁ దొరఁగె నంబుప్రపాతమున;
కాసారవీచికా కంకణత్క్షుబ్ధ [illegible] 160
ఘనఘనాఘనబింబ గాంభీర్య మధిక
భీషణతరం బయ్యె, విఘ్నితధ్యాన
దీక్షుఁ డౌమౌనిముఖతేజంబు భాతి.
చెట్లెల్ల నూఁగాడె సివ మెత్తినట్లు,
ఊఁగాడి యూఁగాడి యుర్విపైఁ గొన్ని 165

గూలెఁ, గూలఁగ నందు గూళ్లలో నున్న
కాకశుకముఖ్యవిహగములు మొఱ లిడుచుఁ
గడఁగె నట్టిటు పాఱఁ, గానివాతూల
ములఁ జిక్కువడి, పక్షములనేర్పు దూల,
గిరగిరం దిరుగుచును గ్రిందఁ బడి, మగుడ 170
నెగుర యత్నము చేసి, యెఱక లల్లార్చ,
కూయు చొయ్యాన దాఁటుగొని, గులకఱాళ్ల
వలె రంయిమని మోఁదు వర్షబిందువుల
కట్టు లటు వైచి, లోనందువ్యథ తేటి
చూచునేత్రంబులనె చూపట్ట సోలె. 175
క్రందుకొనుచున్న చీఁకటు లపుడు తొలఁగ
మెఱుము ధగధగయొకటి మెఱసి, యాక్షణమె
కటికిచీఁకటి జగతిఁ గల్పించి పోయె,
నంధతమసం బనెడియాలింగనమున
నవని యాకాశంబు లైక్యంబు చెంద. 180

పంచభూతంబు లాభంగి నొండొంటి
తోడ డీకొని చల్పుదొమ్మియుద్ధంబు
చాళుక్యవిభుఁడు హస్తములు వక్షము న
మొగిచి చింతన చేయుమొగి మేను మఱచి
యుండె; నటఁ గొంతసే పుండి ధరియించి 185
నట్టిదుస్తులు తడిఁయు టది యెఱిఁగి, కిటికి
మూసి, "మేల్మేలు కుడిబుజ మదిరినట్టి

ఫల మపుడె కొంత గన్పడుచున్న, దింతె
వఱకుఁ జెఱ నైన సేవకవృత్తి యెఱుఁగ,
భోజనము లేక క్షుధ పొందుటయు నెఱుఁగ. 190
అయి యుండు శాత్రవుని యాజ్ఞయె యటంచు,
బాగు, రాజేంద్ర! సంప్రాప్త మగు నింక,
నీధర్మమునఁ జేసి, నిత్యోపవాస
భవ్యపుణ్యము నాకుఁ, బగ దీఱు నీకు,
ఉభయతారకసరణి యోచించి తౌర!" 195
అనుచు మందస్మితం బాస్యమునఁ బొడమ,
దీపంబు వెలిఁగించి, దేహమున నొడు
జల మొత్తి, మాఱువస్త్రములు ధరియించి,
శయ్య నవరించి, లోచనములకు నిదుర
రాకుంట, గదిఁ బచేరము చేయుచుండె. 200
గాలివాసకుఁ దాళఁ జాలఁగా లేక,
బయటఁ గావలి యున్నభటు లపుడు తలుపు
దెఱచి లోనికి వచ్చి తిరుగ నర్గళము
వడివేసి, గజెగజె న్వణఁకునంగములఁ
గాఱుధారలు మడుఁగుగట్ట, మాటాడ 205
దౌడ లాడమిఁ, గొంత తడ వూరకుండి,
యెట్టకేలకు నొక్కఁ డిట్లనియె, "రాజ,
చాళుక్యపుంగవా, క్షమియింపవయ్య.

తప్పు పట్టక యిచట దయ నిల్పనిమ్మ—
ఏమి యీమారుతం, బేమి వర్షంబు! 210
ప్రళయకాలమె వచ్చి పడినదో యేమొ!
పుట్టిచూచుట లేదు మున్ దిట్టిదెపుడు!
పందలముగా, మైనఁ బని చేయఁగలము!
సర్వశక్తుఁడె కినియ సైరింపఁ గలము!
ఉదుటూని యొకయామ మోర్చితిమి, యొకలు 215
గొంకరలు వోవ సాగుట వచ్చినాము,
చాళుక్యపుంగవా, క్షమియింపవయ్య,
తప్పు పట్టక యిచట దయ నిల్వనిమ్మ."
అపుడు మూఁడవసారి యాచళుక్యునకు
జయ మనుచు దక్షిణభుజం బదరె మరల; 220
అదరఁగా, నులికి, "హా!" యని పెదవి కఱచి,
తల యూఁచి, "హృదయమా, తాళుమా," యనుచు,
నిట్టూర్పు నిగుడించి, నెమ్మి నాచోళ
దౌవారికులకు వస్త్రములు దుప్పట్లు
నిచ్చె; వారవి దాల్చి యిల వ్రాలి మ్రొక్కి, 225
'యిటువంటిపుణ్యాత్ము లవ [illegible]
మాయలుబిడ్డలను మరణంబునుండి
కాపాడుదురొ లేదొ కరుణ నీరాత్రి!"
అని వనరువారలకు ననియె విమలుండు,
"కారావిముక్తి యేకరణినో యనుచుఁ 230

దత్తఱిల్లుచునుండు, దానికై ప్రాణ
మైన నొగ్గుదు, నైన నాడి తప్పుటలుఁ
గాంగేయధర్మజకర్ణాదిసత్య
సంధులను గన్నయలచంద్రవంశమున
జన్మించినాఁడ, నది చాలు, వేయేల ? 235
వాగాన మిదె, మీరు వచ్చునందాఁక
నను గవలఁ బెట్ట నేయత్నంబు చేయఁ
జనుఁడు మీగ్రహములకు సందేహ ముడిగి. ”
ఆమాట లాలించి యాచోళభటులు,
“చచ్చి నీకడుపుననె జననమొందుదుము, 240
చిరశుభంబులు నీకుఁ జేకూరఁ గలవు,
నిను నమ్మమిని గాదు, నీవు పూజ్యుఁడవు,
చాళుక్యపుంగవా, క్షమియింపవయ్య,
యేలికముదల లేదీతావుఁ బాయ,
మాయాలుబిడ్డలకు మాధవుఁడె తోడు.” 245
“బాపురే ! మీరాజభక్తి నే మెత్తు,
వినుఁడు మఱియొకమాట, వీరభటులార,
బంధనవిముక్తికై ప్రాణంబు లైన
నొడ్డ నాయత్తుఁడై యుంటి నని పలికి
నట్టిపలుకులు నిలుప నదను నా కిదియె; 250
వాఁడికరవాలములు పట్టి మీ రిర్వు
రున్నారు, నా చేత నొకకట్టియైన

లేదు, నేనొంటరిని, లే దధర్మంబు."
వ్యాఘ్ర మాఁకట లేడిపై కుఱుకుపగిది,
నుంకించి భటులపై కుఱికె విమలుండు. 255
పావురంబును డేగ పట్టుచందమున,
నొకనిగొంతుక పోఁక యొకచేయి చాఁచి
పట్టి నొక్కఁగ, వాఁడు పడవైచెఁ గత్తి;
పెఱచేత నది యంది పెఱభటుని వ్రేఁటు
తగులకుండఁగ నొఱగి, త్వర వాఁడు మరల 260
వ్రేయులోపల మొదటిరిపునిఁ బడఁ ద్రోసి,
పాద మట్టున నాని పండ్లు బిగియించి,
కురియుదెబ్బలఁ గాచికొనుచుఁ, దఱి వేచి
ప్రక్కలోపలఁ బొడిచి భటుని ధరఁ గూల్చె.
గంతు వేయుట యు, నర్గళము దీయుటయు, 265
వెలుపలకుఁ బోవుటయు, గొలుసు పెట్టుటయు,
ఖడ్గంబు నోటను గఱచి పట్టుటయు,
బట్ట సవరించుటయు, బార వేయుటయుఁ,
జెప్పఁ బట్టినయంత సేపైన లేదు.

---

# ౪. మువ్వబంతులు.

---

బంతికిని బంతికిని బారెడేసముగను
దొమ్మిదడి పసిడిబంతులు వ్రేలుఁ, ద్రిభుజ
కోణముల నొక్కొకటి కొమరొందుఁ, బ్రక్క
ప్రక్కను రెండేసి భాసురంబుగను;
ప్రతికోణమున నున్నబంతియును దాని 5
కిరుగడల నున్నవియు, నీమూఁడుబంతు
లొకజట్టుగాఁ గూడి యుండుఁ, దొమ్మండ్రు
పూఁబోఁడు లీయాట పూని యాడుదురు.
బంతి యొక్కొకతె చేఁబట్టి వైవంగ,
జట్టుబంతులు మూఁడు సరగ రివ్వనుచు 10
నొక్కచోటను జేరి యొండొంటిఁ దాఁకు.
మూఁడుజట్టుల చెండ్లు మూఁడుమూలలను
జేరి తాఁకఁగఁ జెండుచెండునఁ వ్రేలు
మువ్వలొక్కట నన్ని మ్రోఁగు గల్లనుచు.
ప్రతియాటకత్తె తనబంతి యటు వైచి 15
పైబంతికై పోవు; పైబంతి వైచి,
దానిపై నున్నయద్దాని వైవంగఁ
బోవు, నీరీతి సమ్మోదమునఁ బాడు
ముద్దుపాటకు మువ్వమ్రోఁత తాళంబు.

గాఁగ, బంతులఁ గ్రమముగా వైచుచుంద్రు. 20
తాళ మెప్పుడు సరణి దప్పునో యపుడు
వేఱుపక్షపుఁజెలులు వికవికలు చెలఁగ
బంతులను గొనియెదరు పంత మాడుచును.
ఆట పండుదు రైదు నైదును మొదట
పాట లేపక్షంపువారు పాడుదురొ. 25
ఆటలన్నిటిలోన మేటియీయాట,—
మువ్వబంతులయాట ముదితలకుఁ బ్రీతి.
"పోని, మాయా యెంత పోయినను, వదినె,
యంత నవ్వుట కేమి యవసరమొ యెఱుఁగ.
ఇప్పుడే మే మింత మెల్లిదం బైనఁ 30
జోళరాణివె యైనఁ జూతువా మమ్ము ?"
"కుందవాంబా, యింత కోప మేలమ్మ,
యిట్టు లాడుటకు నే నేమి చేసితిని ?
ఆటలో నవ్వంగ నది యొక్కతప్పు
గాఁ దలఁచు టుచితంబె ? క్షమియింపు మైన." 35
"క్షమియింప నంత యధికారులమె మేము ?"
అని యింక నేమియో యనఁ బోవుచోళ
వల్లభాత్మజఁ దోడివామలోచనలు
వాదములు మాను మని వారించి, రంత—

పాట

1. "హర శంకర అభయంకర క్షేమంకర కరుణాకర 40
నమోనమోనమో!

పరమేశ్వర మహేశ్వర కరుణాకర నమోనమోనమో!

అకలంకసుశ్లోకేందు సంపూర్ణాతపోజ్జ్వల వైభవాన్వితుఁ
జోళభూవిభుఁ బ్రోవుమో
ప్రభూ ప్రభూ ప్రభూ !॥ హరశంకర॥ 45

2. శశిశేఖర హర నిర్ఝరతటినీధర కరుణాకర
నమోనమోనమో!

అర్ధాంగధృతనారీశ్వర, కరుణాకర నమోనమోనమో!
దారిద్ర్యకుంజరకేశరిన్ బుధలోకరాజీవౌఘభాస్కరుఁ
జోళభూవిభుఁ బ్రోవుమో 50
ప్రభూ ప్రభూ ప్రభూ! ॥ హరశంకర॥

3. కాకోదరకంఠాభరణా, భీకరనయనా హరా
నమోనమోనమో!

హాలాహలవిషకంధర కరుణాకర నమోనమోనమో!

జనకంటకోత్కటభీకరాకారుఁ త్వచ్చరణాబ్జ శేఖరుఁ 55
జోళభూవిభుఁ బ్రోవుమో
ప్రభూ ప్రభూ ప్రభూ!

హరశంక—"

"హరశంక—"యని చేడియలు కందుకములు

వైన నందొకటి త్రెళ్ళ పడె నేలపైని.    60
పడ, కుందవాదేవి పక్షంపుసఖులు
పక్క మని నవ్వి చప్పట్లు చఱవంగ
నా దేవి యిట్టులను, "అన్యాయమార్గ
మున జయం బంద నేముష్కరుల కైన
నగునె సాధ్యంబు మధురాంతకదేవి?    65
వృత్తి అయిదుకు
మాపాట్లలయ చెఱచి మాయాట చెఱచి
యాట మీ రేపాటి యాడఁ గల్గితిరి?
పాట మే మొంౘైనఁ బాడితిమి కాని,
యది కూడ లేదు మీ, కాట విడవమ్మ."
మ॥ "మీయాట పోవుటకు మేము కారణము    70
గాము కామమ్మ, యాకందుకము దెగుట
మాతప్పు గా, దెంత మాత్రంబు గాదు,
కానఁ గ్రమ్మఱ దానిఁ గట్టి యాడెదము."
కు॥ "చాలుఁ జాలును వదినె జాణవే కాని,
మువ్వబంతులయాట మొగి మెఱుఁగనట్టి    75
పాలఁతు లున్నారు కాఁబోలు, మాయన్న
పట్టి తెచ్చినవిభునిపట్టణమునందు,
వారికడఁ జెప్పు నీపద్ధతులు, చోళ
మండలం బిది, యంధ్రమండలము గాదు."
ఖు॥ "కాఁబట్టియే ధరాకాంతుగారాబు    80

బిడ్డలకు, నోచోళపృథ్వీశుపుత్రి,
ప్రత్యేక మగుధర్మపథ ముండఁ బోదు."

కు॥ "పృథ్వీశుగారాబుబిడ్డలకు లేక,
యోచోళరాజేంద్రయువరాజపత్ని,
కోడండ్ర కుండు ననుకొనుచుంటివమ్మ?" 85

సీ॥ ఈవిధంబున మరల నీసూని వార
లిర్వురుఁ వాదమున కెగయ నెచ్చెలులు,
"రాపాడ వృక్షముల్ రాలునవి కాయ,
లెగ్గు మన కగుఁ దుదకు నీకయ్యమునను,"
అని యెంచి తమలోన, నం దొక్కమగువ, 90
"మధురాంతకమ్మ, నామాట వినవమ్మ,
తగ్గవలె నొక రైనఁ దప్పెవరిదైన,
ఆటలో జగడంబు, నీటిలో నిప్పు,
బోటినోటను మాట పుట్టఁ దగదమ్మ."

కు॥ "పద్దు సాగుటయె కావలె నన్న, నీవె 95
యాడవచ్చును, కుందవాంబఁ, గొనవమ్మ."
అని కేలిచెండు మధురాంతకకాంత
యుడిగి ప్రక్కకుఁ దొలఁగ, "ఓవదినె, నీదు
చేతిబిచ్చమున కాసింతు ననుకొంటె!—
తప్పెవరి దైన నఁట!—తల్లికమలమ్మ, 100
చెప్ప వచ్చితివి, నేఁజేయునపరాధ
శతము నీవనుదినము సైరింపకున్న,

ముప్పు నా కీసరికి మూడిడియుండు గదె!"
అని యొక్క తడ ఫ్రుంషి యనియె రాపట్టి—
"మనయీ తెఱంగెల్ల మా అమ్మతోడఁ 105
జెప్పి, యాదేవి తీర్చిన రీతి నీకు
సమ్మతము గాదేని, శాంతాత్మలార—
పదుపట్టితినా!—మీపద్దె కానిండు."
"కానిమ్ము, మా కంతకంటె నిఁక నేమి
గావలె, మహాదేవిఁ గాంచి యడుగుదము, 110
రండు రం," డంచు మధురాంతకముఖ్యు
లందఱుఁ రెండు మూఁడడుగు లటుపోయి,
రంతట మహాదేవి యామెయే వచ్చె.
అతిధీరపత్నియు మహాధీరమాత)
యగుటచేఁ బెం పొందినట్టి మహనీయ 115
గర్వమ్ముఁ మీఁత్రి పైఁ గప్పట్టుప్రాజ,
హృదయసౌజన్యసద్వృత్తి యన, వార్ధ
కవ్యాప్తిఁ ద్రోపి, నిజకమనీయరూప
వైఖరుల్ విలసిల్ల వదనమున, రాజ
మహిషీలలామంబు మందహాసమునఁ, 120
"ఏ మమ్మలార, మీ కేమి గావలయు?"
అని యడుగ, "మధురాంతకమ్మ—" "అదిగాదు—"
"బంతి తెగినే—" "శం దవాదేవి—" "వదినె—"
"దానిఁ గ్రమ్—" "కాదు—" "రాంతకదేవి—" "ఏమి

గోల." "చెప్పుమునీవె." "కుందవా" "అనియె." 125

ఇట్లొక్క మాటుగా నింతు లొకరాడు
మాటలకు వేఱొకరిమాట లావంతి
పొందకుడఁగఁ జెప్పుచంద మాలించి,
యర్థ మెఱుఁగంగ లే, కామహాదేవి
యెట్టకేలకుఁ దగ వెల్లయుం దెలిసి, 130

"న్యాయంబు, మధుర, నీ దని యెంతు, నైనఁ
జేలము మీ రిర్వు రీచందమునఁ బూని
యుంచుటను, గ్రొత్తయా టొండొడఁ జూతు,"
అన, కుందవాదేవి, "న్యాయంబు మధుర
దే యైనయెడఁ, జేలం బెల్ల నాయదియ 135
కాద? ఇర్వురి దనంగా నేల? క్రొత్త
యా టాడ నేల? ఔనమ్మ నీవాక్కు,
ధర్మ మెప్పుడుఁ బ్రభుత్వమును సేవించుఁ,
గుటిలగుణపుంజంబు కుందవాదులది."

అన నవ్వి కూర్మితనయను జూచి దేవి, 140
"రాజ్యముల్ పోవునా, రాణువల్ మడియు
నా, విప్రలాపంబు లాటకై యిన్ని
పాడియే, యొకయింటిపడఁతు లీభంగి
జగడ మాడఁగ నగరె సాటివారెల్ల?"

"రాజ్యముల్ పోవుటకు రాణులము గాము, 145

మడియుటకు రాణువల్ మా కెక్కడమ్మ?
ఏలుచుంటివి రాజ్య, మేలెడిది యామె,
రాణువలనాథుఁ డగురాజేంద్రవిభుని
గన్నదానవు నీవు, కైపట్టె నామె;
రాజ్యముల నోడుటకు, రాజ్యముల్ గెల్వ, 150
రాణువల నోడుటకు, రాణువల్ గెల్వ,
సములు మీరలె సత్వసంపదల, మీకె
యాడఁ జెల్లును గ్రొత్తయాట లవి యొడ్డి;
తల గలదె మీ కెదురు తగుల మాబోంట్ల
కాటలో నైన? నే నరుగుదు," ననుచు. 155
జన్నంబునాఁటిద్రౌపది యజ్ఞప్తి
వచ్చునిష్ఠురగతిఁ, వచియించి కేళి
సదనంబు వెడలి పో సంభ్రమం బందు
నిజతనూజాతఁ గని, "నిల్వు మోదేవి!"
అని రాజమహిషి; యని యధరంబు గదలఁ, 160
బల్కు దొట్రిల, మీఁదఁ బల్కువాక్యంబు
కనులె పల్కఁగ, నొక్కక్షణ మూఱకుండె.
భామ నందనపుత్రి ద్వారంబు చేరి
సగము వెన్కకుఁ దిరిగి జనని నీక్షింపఁ,
జెంద్లాటచరితంబు చెదరె మదినుండి. 165
అల్ల నల్లన నొదిగి యతివ లోకమూల
గోడచేర్పున గుంపు గూడి; రం దొకతె

మోము వాల్చుక నయనముల నెత్తి దేవి
మోముఁ గ్రేగంటిచూపులఁ జూచు ; నింకఁ
గ్రాల్గంటి యొక్కతె కఱచికొను నాల్క ; 170
పెదవు లించుక తెఱచి వేఱొక్కమగువ
విప్పిననేత్రముల వీక్షించు రాజ
పుత్రికను ; పాదాగ్రముల నిల్చి యొక్క
బాల ముందఱివారిపై నుండి చూడ
నాన చేయును ; నొక్కయతివ, యుల్లంపు 175
దడ లచటినిశ్శబ్దతను గలఁగఁ జేయ
కుండ నుంచుటకు నేమో యనఁగ, నురము
నందుఁ గరయుగ్మంబు నదిమికొను. అపుడు
భ్రాతలేశ్వరి పల్కఁ బోవు నద్దాని
సూచింప నన, దిశాస్తోమంబు గరము 180
ఘూర్ణిల్ల, మేఘనిర్ఘోషంబు వినిచె
యువతీజనవ్రాత ముల్కిపడ ; నంత,
ఘోషింప మేఘంబు, కురియు శీతాంబు
ధారలకుఁ బోలె గీతారవం బెసఁగె—

పాట

"గగనమ, నీశోభ లేమి గగనము కావమ్మ మా 185
కగణిత మగుపుష్పచయము లలరుచున్న, వవిగోఁజూడు॥
జగముల నన్నింటి నొక్కసరణిఁ జూచుధర్మ ముడిగి

భగవంతుఁడు నీకె సౌభాగ్యములను దాఁచఁ గలఁడె! ”
పాడు చీరితి సుమబాల యేతెంచె;
దేవియును కుందవాదేవి కిట్లనియె,                190
“చిన్నపెద్దలు లేక చెలఁగు నీనోరు,
పుట్టిన దాదిగా బుద్ధి యొక్కటియె,
పొలఁతులకు మత్సరము పొసఁగునే, నీకు
మాన్యురా లగుఁ గాదె మధుర తలపోయ?
కాకున్న నేఁ గానె? కాన వోకయింత!                195
ఇఁకమీఁదఁ బెద్దలనెదిరించితేని,
నీదుడుకు వదలింతు, నేఁటియీపనికి
నిదియ ప్రాయశ్చిత్త మెఱుఁగు, మీరాత్రి
యుపవాస ముండి, మఱియొక్క కన్యకను
గూడి పావనదేవి కోట దుర్గాంబ                200
యాలయంబున కేగి, యా జగజ్జనని
నాదరంబునఁ గొల్చి యాజ్ఞ గైకొమ్ము.”

# భగవంతుఁడు.

అంధతమసం బనెడియాలింగనమున
నవనియాకాశంబు నైక్యంబు చెందె.
చెలువుదరిఁ జాళుక్యనరపాలసుతుఁడు
మొలలోతునీటఁ గాల్మోపి, వస్త్రంబు
చేతితోఁ దుడిచి, కడుఁ జిందవందైన 5
కురులు వే ముడి వేసికొనుచుఁ గట్టెక్కి,
నయనముల్ మూసి యున్నవి యన్న భ్రాంతిఁ
దేరకొని చూచి నల్దెసల, నొకయడుగు
మేర యైనను గనక మేకొన్న భీతి,
"లేశ మాయాసంబు లేక యవలీలఁ 10
జెలు వీఁది తీరంబు చేరితిని గాని,
నీటికంటెను నాకు నేల యే యధిక
దుర్గమం బగుమాడ్కిఁ దోఁచు, నిమ్మహిని
వైపరీత్యము లిట్లు పాటిల్లుచుండు,"
అని యంతరంగంబునందుఁ దలపోయు 15
చున్నయత్తఱి, దిశల్ శోభిల్ల, నికట
సౌధాదివస్తుసంచయ, మింద్రజాల
శక్తినో యనఁగ, విస్పష్టంబు గాఁగ,
విద్యుల్లతాద్యుతులు విన్వీథి మెండు
ప్రజ్వరిల్లఁ దొడంగె. "బాగు నావిభవ, 20

మెట్టివారికి నైన, నేఁడుదీవులను
బ్రబలి యేలినచక్రవర్తులకు నైన,
దివిజనాథుఁడై కాలుదివియ పట్టుటలు
చేకూరునే!" యనుచుఁ, జిఱునవ్వు నగుచు,
నచ్చోటు వాసి విమలాదిత్యవిభుఁడు 25
కర్తవ్య మొక్కింత గననివాఁ డయ్యె,
నిల్చి యుండుటకంటె నేరంబు లేమి,
బాగైన నోగైనఁ బని పూను టుచిత.
మనునీతి నేర్చి యున్నట్టివాఁ డౌట,
నడవ సాగెను గాని, నగరు మున్నెపుడుఁ 30
జొరమి వెల్వడి పోవుచొ ప్పరసి యరసి,
పల్మాఱు నారాజభవనములనడుమఁ
ద్రిమ్మరినత్రోవులనె త్రిమ్మరుచు, మిగుల
వేసరియు, ధైర్యంబు విడలేక, యాస
ముందు కీడ్వఁగ, నంగముల దుర్బలత్వ 35
మంత కంతకు త్రాళ్ల నడుగులకుఁ గట్ట,
దయము దక్కినబొంగరముకరణిఁ దిరుగు
మండె; సాహసధీరతోత్సాహగుణము?
లవి యక్షయంబులు ననంతంబు లయ్యు,
నస్థిరం బైనదేహముతోడిచెలిమి 40
నస్థిరంబులు గావె? అట్టిబంధంబు
మీఱి యీశ్వరుఁ డప్రమేయుండు గాఁడె?

ఆఘోరమారుతం, బామహావర్ష,
మాయంధకారంబు నల్లె యానాఁటి
రే యెల్లఁ దెగక యుద్రేకించి యున్న, 45
నీచరిత్రక్రమం బేమౌనో కాని,
"నిష్ఫలం బాయెఁ గద నేఁ బడిన శ్రమము,
నిష్ఫలం బాయెఁ గద నేఁ బడినయాస,
నిష్ఫలం బాయెఁ గద నే మ్రొక్కినట్టి
మ్రొక్కు లెల్లను! భటుని బొడిచి వచ్చితిని, 50
వాఁడు తెరలినహత్యపాతకము దక్క,
నిష్ఫలము, నిష్ఫలము, నిష్ఫలం, బిట్టి
యదను మఱియొక్కమా అలవడునె! దేవ
దీన బాంధవ, నాకు దిక్కు నీ," వంచుఁ,
జాళుక్యుఁ డొకమేడచాటున న్నిల్చి— 55
"కానిమ్ము, ఏమైన రానిమ్ము, మరలఁ
బ్రాణమ్ముతోఁ జెఱకుఁ బో, నది నిజమ్ము!"
అని నిశ్చయము చేసికొని చేతికత్తి
జళిపించు చున్నయాసమయమున, నంత
దనుక నెడ లేక భూతలసాగరముల 60
నొకటి చేయంగ నుద్యోగించుచున్న
వర్షంబు హోరుడిగె. బహుబాధ లైన
సత్వంబు చెడకుండ, క్షాత్రంబు విడక,

సంకల్పసాఫల్యసాధనము లెఱిఁగి,
శక్తివంచన లేక శ్రమమునకు నోర్చి, 65
స్వాతంత్ర్యపథ మరయుసాహసాంకులకు
సర్వస్వతంత్రుండు సైదోడు గాఁడె?
ఈరహస్యంబు గుర్తెఱుఁగంగ లేక,
కారణభూతుఁ డాకరుణాకరుండు
భారంబు నా దనెడివాఁ డంచు మఱచి, 70
సారహీనులు పనుల శ్రద్ధ చాలించి,
మాతరము గా దంచు, మన కేల యంచు,
చేత నగుదానియును జేయ జంకుచును,
తగుణ మహానందాంకఁ దావలె నంచుఁ,
బొరుగువారలకడఁక బోనాడి, యెన్నొ 75
సద్విధుల నట్టట జార్చి విలపింత్రు.
భూమ్యాదిలోకముల్ బూదిఁ గలవంగఁ
బూనిన ట్లొకసమయమునఁ దొలుతఁ జెలఁగి,
చేయఁ గలకీడు చెచ్చెరఁ జేసి, యపుడె
యంతరించెడి సజ్జనాగ్రహముఁ బోలి, 80
నాఁడు చోళాధీశునగరమున వర్ష
మాది నారంభమై నట్లంతరించె;
వర్షంబు వోఁ బ్రకంపనదర్ప మొకట
సరళమందసమీరసరణిఁ బ్రసరించె;
మారుతోద్వేగంబు మరల, నాప్రళయ 85

జీమూతవితతి విచ్ఛిన్నమై పోయె,
సంగ్రామరంగమున స్థైర్యంబుతోడ
నిల్తురే భటులు వెన్నీయ నాయకుఁడు?
జీమూతసంతతుల్ చెదరున త్తఱిని,
జంచలాద్యుతిసహస్రములు నల్గడల 90
నేత్రావరోధంబు నెలకొల్పె; నంతఁ
గడసారి ఘుర్ఘురోత్కటఛటస్ఫటల
గర్జితధ్వానంబు గర్ణములఁ జీల్చి,
పరుగుపరుగునఁ బాఱి, ప్రాబల్య మంత
కంత కడఁగఁగఁ, బశ్చిమాశాంతవీధి 95
నన్నగిలిపోయె, శాశ్వతమె దర్పంబు!
సంతసించుచు విమలచాళుక్యవిభుఁడు
సకలసంరక్షకుని సన్నుతించుచును,
నిల్చి కుబుసము విడిచి నీరు వోఁ బిడిచి,
తల ముడిచికొని మేనితడి యొత్తుకొనుచు, 100
నుండె. దివిఁ జలనంబు లుడిగి యొకవతాల
వెల్వాలం బాఱె ఘనవీచికాచయము;
కడమయాకస మెల్లఁ గన్పట్టె నీల
సురుచిరామలమృదులశోభాతిశయము
లలరన్, ప్రబంధరచనారంభకాల 105
మందుఁ గల్గుకలంత లటు తొలఁగ నవ్య
విలసదుల్లాసముల వెలుఁ గొందుభవ్య

కవివిపులమేధావికాసంబులీల ;
గగనంబు కవిచిద్వికాసముం బోలఁ,
బొడిచె శశిబింబంబు పూర్వాద్రి, దివ్య 110
తరశీతమృదుమనోహరకిరణజాల
ము వెన్నెలల లోకమునఁ గొలుపఁ, గావ్య
సుమహాశయోజ్జ్వలస్ఫూర్తి నవ్వేళ ;
కావ్యముఖ్యాశయము కరణి నాచంద్ర
బింబంబు పొడచూప, వివిధాంగసాంద్ర 115
భావసముదయమనఁగఁ బరఁగె నుడుమాల.
ఆఱిపోవఁ గ నున్నయాస యావిమలు
మానసాగారమున మగుడ దీపించె.
ఆహా ! యదృష్టమన నట్టిదే కాద !
అది యదృష్టంబు గా, దచ్చెరువు లేదు, 120
భక్తు లద్దాని భగవంతుఁ డనియెదరు.
"కాల్నడక నైన నిఁకఁ గడఁగి నాపురము
చేరి తీరుదు బొంది జీవ ముండినను ;
నడిత్రోవలోనఁ బ్రాణంబు సడలినను,
మది విచారము లేక మరణింతుఁ గాక ; 125
బ్రతుకుతీపి యె, కాని పరతంత్రు బ్రతుకు
పిండివంటలతోడి పిండాశనంబు."
అని నిశ్చితాత్ముఁడై యలసటను ద్రోసి

యున్నతం బై. తనరునొకహర్మ్యపంక్తి
నీడఁ జాళుక్యావనీశనందనుఁడు, 130
దూరమున మిన్నందుమర్గగోపురముఁ
దఱియంగ, నత్యమంద బైనడకఁ
జని, తటాలున నొక్కచౌకంబు సొచ్చె.
చొచ్చుటయుఁ, జౌకంబుఁ జొచ్చె వేఱొక్క
దెస కాగడా యొకటి; దీపంబు వెనుక 135
రెండురూపములు విమలుండు పొడఁగాంచె.
దీపంబు తా నున్నదిక్కుగాఁ దిరిగి
యల్లనల్లన డాయ నరుదెంచుచుండె.
అయ్యయో! దౌర్భాగ్య మన నదే కాద!
దౌర్భాగ్య మది కాదు, తలఁకఁ బని లేదు, 140
భక్తు లద్దాని భగవంతుఁ డనియెదరు.
"వచ్చువారలు రాజభటులు కాఁబోలు,
భటు లైన, వటులైన, బాలికలు నైన,
నాగుట్టు కాపాడునలు సైనఁ గాని,
యీచోళపురిఁ గలదె, యేమి నావెఱ్ఱి!" 145
అని తల్లడం బందు చట్టిట్టు కలయఁ
బరికించి, చాళుక్యపార్థివసుతుండు
తల దాఁచికొనఁగ నేతా వైనఁ గనక,
వెర వొండు లేమి, మునివ్రేళ్లమీఁదుగను

బిగుగొని, వెంబడిని బల్లెంచుగట్టి 150
దీపంబువంకఁ దల ద్రిప్పి యందంద
చూచుచుం జని, యొక్కసోపానసరణి
మార్గంబుదరిఁ గాంచి, "మాయురే!" యంచు,
నడుగడుగునకు మెట్ల నైదింటి వరుస
నెక్కి, కడమె ట్లెక్కి, యే మైన వెలుఁగ 155
లేకయే, యొకచిమ్మచీఁకటి ముసుంగు
ముఱుఁగులోపల నంటమాత్రమే యెఱిఁగి,
తొంగిచూచుచు, భటులు తొలఁగునందాక
నట దాఁగుటే ధైర్యమని యెంచి నిల్చె.
స్వేచ్ఛకై మానవుఁడు స్వేచ్ఛ గోల్పోఁడె, 160
స్వేచ్ఛ గోల్పోయి తుద స్వేచ్ఛ గైకొనఁడె!
అగ్గలం బై యెప్పు డన్నివైపులను
గప్పయార్పులు, వానకాల్వజల్లలుఁ,
జిమ్మటలకీంకృతులుఁ, జెట్లపై నుండి
పడెడుచిన్కులచిట్కుపట్కులుఁ జెలంగ. 165
వీని నన్నిటి మీఱి వినవచ్చె నంత—

పాట.

"నిన్న ప్రొద్దు పోవువేళ సన్నజాజిమొగ్గలతోఁ
గొన్ని మల్లెమొగ్గలు జత గూర్చి దండ గ్రుచ్చి యుంటి;
మల్లెల కెన యగుచు నాయుల్ల ముప్పొంగఁ జేసి,

చల్లఁగా సువాసన వెదచల్లుచుండె జాజు; లంత 170
దండ రాత్రి శయ్య నుంచి పండుకొంటిఁ, దెల్లవాఱ
నండ నున్నదండ చూడ నబ్బురంబు దోఁచె మదిని;
వాడిపోయె జాజు లన్ని, వాసన లే మాయెనో?
పోఁడిమి చెడ లేదు మల్లె పూవు లింకఁ దావు లొత్తె." 175

గానంబు ముగిసె, నాగానంబు సల్పు
బాలికయుఁ దోవచ్చు భామయు నెట్ల
నెక్కుఁ దొడఁగిరి, విమలునెద జల్లు మనఁగ.
ప్రారబ్ధ మది గాన, పాప మది గాద?
ప్రారబ్ధమును గాదు, పాపంబు లేదు, 180
భక్తు లద్దాని భగవంతుఁ డనియెదరు.

చోళభూపతివైరి చొచ్చినది కోట
దుర్గాంబయాలయము, స్వర్గగోపురము;
ఆయంబఁ బూజింప నవుడు సుమబాలఁ
గూడి వచ్చినకన్య చోళపతిపుత్రి!

---

# ౬. ఒకగాథ.

---

మందహాసంబు సన్మార్గవర్తనుల
యుల్లములఁ బరితోష ముదయింపఁ జేయ,
నయనఖరదీప్తి దుర్నయుల ధైర్యంబు
సడలింప, నభయహస్తము భక్తవర్గ
చిత్తసంక్షోభంబు ఛేదింప, నితర 5
హస్తసంభరితవివిధాయుధౌఘంబు
లోకకంటకహృదయభీకరము గాఁగ,
ధరఁ గూలి యున్నట్టిదనుజువక్షమునఁ
జరణ మొక్కటి యూని శర్వాణి నిల్చె.
విగ్రహము చాటుగా విమలుఁడు న్నిల్చె; 10
నిల్చి, "మోధుఁ వీఁక నిరసించి వచ్చి
యబలలకు జడిసి యిప్పు డడఁగితిని, భువిని
వైపరీత్యము లెన్నొ వాటిల్లుచుండు."
అంచుఁ దనదురవస్థ కడలునత్తఱిని,
సుమబాలయుక్త రాజసుతయు మెట్లెక్కి, 15
యాలయము చొచ్చి, దుర్గాంబసన్నిధికి
వచ్చి, రప్పుడు బాల పల్కెనీరీతి—
"కాదమ్మ, యశ్రద్ధ గాదమ్మ, యిట్లు
పగలు రాత్రియుఁ దల్పు ద్వారంబు లేక,

దేవినిలయం బెపుడుఁ దెఱచియుండుటకుఁ 2(
గారణముగా నొక్కకథ చెప్పకొందు.”
అని చేతికాగడా యచట నొకప్రక్క
వేదికకుఁ జేర్పగాఁ బెట్టి, వ్రేలాడు
పయఁటకొం గెగదోఁపి, ప్రమిద వెలిఁగించి,
శక్తిపూజార్థమై సామాగ్రు లన్ని 25
సవరించు చిట్లు కథవివరించె నపుడు—
“వినవమ్మ యీచోళవిషయంబు తొల్లి,
తణసింహచోళుండు రాజ్యంబు చేయు
కాలమం, దొకనాఁడు కావేరితటిని
దేజమున నాసాంబదేవునే పోలి 30
మహితగాఢసమాధిమగ్నుఁడై యున్న
యోగిసత్తము నొకని నుదయమునఁ గాంచి,
చారు లంవార్త దమస్వామి కెఱిఁగింప,
సత్వరంబునఁ జోళజననాథుఁ డేగి,
యోగదీక్ష మునీంద్రుఁ డుడిగి కన్దెఱచు 35
పర్యంత మచట నతిభక్తితో వేచి,
సాష్టాంగముల్ సల్పి, సమయంబు వడసి,
యాతపోధనవిభవు నత్యాదరమునఁ
బురి కవుడు తోడుకొని పోయి, ‘ధన్యుండ,
పరమపురుషా, నేఁడు పావనం బయ్యె 40

నామందిరం, 'బంచు నగరులో దించి,
పూజించుచుండె నాపుణ్యాత్ముం సతము.
లోకవిజ్ఞానపరలోకసుజ్ఞాన
కోవిదుం డైనయాగురుపదానంద
యోగివర్యుండు, సద్గుణోల్లాసమయుండు, 45
విద్యాస్వరూపుం డని విద్వాంసు లెల్ల,
జగదేకగురుం డంచు జను లెల్లం బొగడం,
బరమభక్తుం డంచు భాగవతు లెల్ల,
జగదేకసఖుం డంచు జను లెల్ల మ్రొక్క,
నాదివిష్ణువు దొల్లి యవతార మెత్తి 50
యుర్విపై సంచార మొనరించినట్లు,
లాచోళపురిలోన నాఱుమాసములు
నివసించె, నంత నొక నిసిరాత్రి వేళ,
నంబికాగుణగణధ్యానపరవశత
మై మఱచి, శయనసదనము వెడలి, యోగి 55
కోటదుర్గాదేవికోవెలకుం బోయి,
మూసి యుండినతలుపు ముట్టిం దట్టంగ,
గడియలుం దాళముల్ గల్లు మని నేల
రాలెం, గవాటంబు దూలెం బసివాండు
చేర రాం, గౌంగిటం జేర్చికొనం గరము 60
త్వరం జెందుతల్లిహస్తములరీతిగను.

గురుపదానందుండు గుడి చొచ్చి, యచట
నియతి నాదివ్యసన్నిధిఁ గొంతతడవు
పుచ్చి, పరమానందపూర్ణచేతస్కుఁ
డగుచుఁ, గుంకుమ దీసి యంబనెన్నుదుట 65
బొట్టుంచి, చేదోయి ముకుళించి మ్రొక్క,
మ్రొక్కు దోసిటిలోన నొక్క మాణిక్య
మాణిముత్యాపువలయమం దిమిడి యున్న
దానిఁ గన్గొని, 'ప్రసాదము తల్లి,' యనుచు,
జడముడిఁ బెట్టుకొని శక్తి వీడ్కొనియె. 70

పూజారి మఱునాఁడు పూజకై వచ్చి,
తెఱచి యుండినతల్పు తెలతెల్లఁ బోయి
కని, లోపలికి వేగ చని, నోరు తెఱచి,
దేవీశిరోరత్నదీధితుల్ గనక,
గుండె జల్లుమన, గోలుగోల్మనుచుఁ 75
బరుగుపరుగున రాజభవనంబు చేరి,
తా నెఱిఁగి యున్నవృత్తాంతంబు నెల్ల
విన్నవించెను విభుఁడు విస్మయము పొంద.

విస్మయము మొదట, నావెన్క నాగ్రహము
రగులకొన డెందమున, రణసింహుఁ డంత, 80
'భయ మేమి లేక యీపాపకృత్యంబు
చేసిపోయినధూర్తుఁ జీల్చి వధియింతు.

రణసింహచోళుండు రా జన్నమాట
మరణకాలం బగుట మఱచెఁ గాఁబోలు.
ఎట్టివాఁ డైన, వాఁ డెందు దాఁగినను, 85
బట్టి యీడ్చుక వచ్చి బహుమతుల్ గొనుఁడు.'
అని భటులు నల్వురకు నాజ్ఞ యిడి పంప,
వా రరిగి, యం దిందుఁ బవ లెల్ల మాఱు
వేషముల్ వేసికొని వెదకి వేసారి,
య స్తమయసమయమం దాయూరిబయటఁ 90
దిప్పపై పశ్చిమపుదిక్కుగాఁ దిరిగి
మింటఁ జెక్కిన ప్రతిమ మెయిఁ గానఁబడుచు
నిల్చి యుండినయొక్కనిశ్చలాకృతిని
జూచి, 'ఎవ రది వెళ్లి చూత,' మని డాసి,
యులికిపడి కన్గొనిరి యోగీంద్రు జడల, 95
నపు డపరదిశ వ్రాలు నరుణబింబమును
మించి నెగడుచుఁ గనులమిఱుమిట్లు గొలుప,
దేవీశిరోరత్న దివ్యదీధితుల.

క్షుద్రచిత్తులు, కఠినసూత్రశిక్షితులు,
పతియాజ్ఞ నెరవేర్చుపని గాక, వేఱు 100
మంచిచెడ్డల నరయుమత మెఱుఁగనట్టి
యాచోళభటు లప్పు డామహామహుని,
మౌననిష్ఠాపరుని, మది శంక లేక,

చెఱ పట్టి సంకెళ్లు చేతులకు వేసి,
'దొఁకినా వింక, నీదొంగభ్యానాలు 105
మానిరావయ్య, నీమాయలకు లొంగి
విడుతు మను కొన్నావ, వెఱ్ఱివన్నాసి?
కదలవే?' యనుచు, నాఘనయోగనిరతు
మెడ పట్టి జాడించి మితి మీఱి, 'నడువు,
నడువు,' మని ముందుగా నడవ గెంటుచును, 110
రమ్మంచుఁ జెయి పట్టి రా నీడ్చుకొనుచుఁ,
బని తీఱెఁ, దమయింటిభాగ్యంబు పండెఁ,
బ్రభునను గ్రహ మబ్బె, బహుమతుల్ దొరకె
నని లోన నుప్పొంగు, చాదారి నొక్క-
కల్లుగుడిసెను దూఱి కంఠములు నిండఁ 115
ద్రాగి మత్తిల్లి, కార్యము సగము మఱచి,
మఱచియును, క్షీణమైన మహేంద్రు విడక,
యూడుచుఁ బాడుచు నం దిందు మసలి,
నడురేయి యగువేళ నగరంబు చేరి,
యా ర్కాటుమణిఁగె విభు నుదయమునఁ గాని 120
చేర రాదని యెంచి, చెఱసాలలోన
యోగీంద్రు బంధించి, రయొడలిమైకంబు
దీఱ నచ్చోట నిద్రించి రాభటులు.
పూసెజ్జపై సంతిపురమందు సాంద్ర

నిద్రాతరంగముల నెమ్మి నోలాడు 125
చుండె రణసింహచోళుం, డట్టివేళ
గాఢమై నల్దిశలఁ గ్రమ్ముకొని యున్న
నిశ్శబ్దతను జీల్చి నెగడె నొకరవము,
'కొక్కరోకో,' యనుకుక్కుటారవము;
కుక్కుటారావంబు కుంభినీరమణు 130
స్వప్నమున గంభీరశంఖనాదంబు
రీతి వీనులఁ దాఁకె హృదయంబు కదల.
శంఖనాదము ముగిసెఁ, జండికాదేవి
రౌద్రరూపము దాల్చి ప్రత్యక్షమయ్యె;
ప్రత్యక్షమై నిల్చి పల్కె, 'మహాత్మ, 135
బ్రహ్మవిద్యాధికుఁడు, పరతత్త్వవిదుఁడు,
సకలసద్గుణయుతుఁడు, శాంతరూపుండు,
మానికులభూషణుండు, మద్భక్తుఁ డట్టి
యుత్తమోత్తముఁ డైన యోగిసత్తముని
జెఱసాలఁ బెట్టించి, గురుపదానిందు, 140
నిద్రించుచున్నావ నీవు హర్మ్యమున?
ఔర! నన్ దర్శింప నాతురతఁ బొంది
వచ్చువారిని నాఁప వశము రా నీకు?
నీతలుపు,తాళాలు, నీనిబంధనలు,
గడియలు, గొలుసులున్, గారాగృహాలు— 145

ఇవియటర !—నీ తెల్వి యేమి యనుకొందు !
ఇవియటర !—చాల్చాలు నేమి నీభక్తి !
ఇవి యటర, నాకోవె లిన్నాళ్లనుండి
రక్షించుచున్న, యోరాజాధిరాజ !
రాజాధిరాజు, మఱి పూజారివిటుఁడు, 150
సంపూర్ణవేదాంతి, స్వర్ణకారుండు,
వీరు నల్వురు దేవవిత్త మనుశంక
మాని వేయుటె నీతిమార్గ మని యెంచి
కాఁబోలుఁ, బెద్దయధికారివై, నేను
మెచ్చుకొని భక్తునికి నిచ్చియున్నట్టి 155
నాశిరోరత్నంబు నీసొమ్ముగాను
భావించి, రోషించి, భటులఁ బంపించి,
యిట్లు కత్తుల నూఱి యెగురుచున్నావు.
నేర మొండిన, నాది నేరంబు గాన,
న్యాయ మాలోచించి, నన్ను దండించి, 160
ప్రభువువా రాగ్రహము వదలి యోగీంద్రు
—ఏపాప మెఱుఁగఁ డాతాపసోత్తముఁడు—
విడిచివేయుఁడు లేచి, వేఁడుచున్నాను.'
దివ్యశంఖాభీలతీవ్రనినదంబు
మరల వినఁబడె—దేవి మాయమై పోయె. 165
త్రుళ్లి పడి, లేచి, కూర్చుండి, భూవిభుఁడు,

వెఱ్ఱిచూపుల మోము వెడఁగొంద, నొక్క-
క్షణ మూరకుండి, కల జ్ఞప్తి రా, నులికి,
'మునిఁగి పోయెను గొంప, మూర్ఖుండ నైతి !'
అనుచు దిగ్గన నిల్చి యంతఃపురంబు 170
విడిచి, సోపానముల్ వేవేగ దాఁటి,
యుత్తరీయం బైఁ నొంటిపై లేక,
జుట్టు వ్రేలాడంగ, బట్ట బిగియించు
కొనుచు, వాకిట మేలుకొని యున్న ద్వార
పాలకుల్, నిల్వ్వ మని పరికింపఁ జేర 175
వచ్చి, గ్రక్కున రాజువదనంబు గాంచి,
యదరి పడి నిశ్చేష్టులై చూచుచుండఁ,
బరుగెత్తి, చెఱసాలయరుగుపై గుఱ్ఱు
పెట్టుచుండినభటులఁ బట్టి కదలించి,
కొట్టి లేపఁగ, నొకఁడు నిట్టూర్పు దీసి 180
యావులించుచు లేచె; నంత రాజేంద్రు
కంఠంబు విని, బద్ధకం బెల్ల మెగిరి
పోవ, భటు లందఱును, 'పోయె బ్రతు' కంచుఁ,
గంపింప దేహముల్, గద్గదిక పుట్టఁ,
బతిపాదములమీఁదఁబడి, 'మహారాజ ! 185
నిజ మొప్పుకొందు మిఁక, నేమంబు తప్పి
త్రాగి మత్తిల్లితిమి జాగుచేసితిమి,

జోహా ర్మహాప్రభూ, జోహారు దేవ,
మొదటితప్పిది మమ్ము, మ్రొక్కుచున్నాము,
కాచి రక్షింపుమా కనికరముతోడ.' 190
అని మొఱ్ఱ పెట్టుకొను చాభటుల్ పలుకు
మాట యొక్కటి యైన మానవేశ్వరుని
చెవుల కెక్కఁగ లేదు; శీఘ్రమున నతఁడు
చెఱతలుపు వారిచే తెఱపించి, నేల
ఱాళ్లపై నట మహారాజువలె నిదుర 195
హాయిగాఁ బోవుచున్నట్టియోగీంద్రుఁ
జూచి, యాపుణ్యపురుషుని లేపి, వేగ
బంధముల్ స్వయముగాఁ బదిలముగ విప్పి,
దివ్యపాదద్వయము దీనుఁడై పట్టి,
'అపరాధ, మపరాధ, మపరాధ మయ్యొ! 200
నీయతులమహిమంబు నే నెఱుఁగ లేక,
యపరాధ మొనరించి యార్తుండ నైతి;
స్వామి నీవే నాకు శరణు, నామీఁద
నంబికాదేవి యిపు డాగ్రహము పూనె,
సద్భక్తి నాతల్లి శాంతింపఁ జేయు 205
భారంబు నీదె, నాభారమున్నీదె,
సాధుజనభవ్య, నీచరణసేవకుఁడ.'
అని వేఁడి యోగీంద్రు నభయంబు వడసి,

యరిగె నెమ్మది పొంది; యాదినమునుండి
కోట దుర్గాదేవిగుడి యహర్నిశముఁ, 210
గూడ దెప్పుడు మూయఁ గూడ దని విభుఁడు
శాసించె, నాఁటియాచారమే నేఁడు
జరుగుచున్నది, దీనిచరిత మిది యమ్మ."

P. Seshagiri Rao
Senior [illegible] Class.
Venkatagiri Rajas College
Nellore

# ౭. చోళభటుఁడు

అగ్గలం బై యప్పు డన్నివైపులను
గప్పయార్పులు, వానకాల్వజల్లలుఁ,
జిమ్మటలకింకృతులుఁ, జెట్లపైనుండి
పడెడుచిన్కులచిట్కుపట్కులుఁ జెలంగె.
　వీనినన్నిటి మీఱి వినవచ్చెనంత— 5
"ఎవరయా, గట్టుపై నెవ్వరైనలేర!
రండయా, చాళుక్యరాజు మముఁ జంపి
పాఱిపోయెను, వేగ పట్టుకొండయ్య!
ఎంత దారుణ మయ్యె, యెంత దారుణము!
ఎవరయా, గట్టుపై నెవ్వరైన లేర! 10
అయ్యయో, నాప్రాణ మాగ దయ్యయ్యొ!
రండయా, వేవేగ రండయా, పొండు
పొండయా, వేవేగ పొండయా, పోయి
ప్రభువువారికిఁ జెప్పి రండయా వేగ;
రండయా, చాళుక్యరాజు మముఁ జంపి 15
పాఱిపోయెను, వేగ పట్టుకొండయ్య;
ప్రాణాలు మఱి లేవు, బయట గొలుసయ్యొ!
పొండయా వేవేగ, పొండయా, పోయి
ప్రభువువారికిఁ జెప్పి రండయా వేగ!

ఎవరయా, గట్టుపై నెవరైన లేర !" 20

విమలుండు చెఱనుండి వెల్వడిన వెన్కఁ,
బడియున్నయాచోరభటులలో నొకఁడు
డెట్టకేలకు దేహ మెఱిఁగి ఱడఁబడుచు,
"ఈపాపునిద్ర న న్నెప్పుడో కాని—"
అనుచు దిగ్గున లేచి, "అయ్యయో" యనుచుఁ 25
జతికిలంబడె, నంత జరిగినది యంతఁ
దెలిసి, "ఎట్లోర్తు నీతలవంపు, లిఁక
బ్రతు కేల ?" అని కంట బాష్పముల్ గాఱఁ,
బ్రవహించుగాయంబు పదిలముగ నదిమి,
మెల్లమెల్లన దేఁకి, మొదలకున్నట్టి 30
చెలికానిఁ జేరి, "హా ! శివశివా !" యనుచుఁ,
బ్రవహించుగాయంబు పదిలముగ నదిమి,
మెల్లమెల్లగ దేఁకి, మే నీడ్చికొనుచుఁ,
బోయి తుద కెట్లో వాతాయనము చేరి
మెల్లమెల్లగ లేచి, మే నెత్తికొనుచు, 35
నిల్చి, మిగిలినగాలి నిల్వఁ గాఁ బట్టి,
మూసి యుండినతల్పు దీసి మొఱపెట్టె.

భటుని కేకలు చెవులఁ బడినవా రెల్ల
నుల్లంబు లదరంగ, నుల్కిపడి లేచి,
నగరులోపలనుండి, నల్దెసలనుండి, 40

"ఎవ రెవ్వ ?" రనువారు, "ఎవ్వ ?" డనువారు,
"ఏమేమి,?" యనువారు, "ఎక్కడ?" డనువారు,
"పట్టుగొం," డనువారు, పంకించు కలలు,
ముక్కులపై వ్రేళ్లు, మూఁగసెట్టొకఁడు,
"పడవబీగము పగుల బాఁదుఁ," డనువారు, 45
"వద్దు తొందర, వద్దు వ," ద్దనెడివారు,
"నిల్చి దిక్కులు చూడ నెగ్గునా ?" యనును;
గూర్చుండి చక్కగాఁ గునుకునేర్పరులు,
"భయములే," దనువారు, "పాప ?" మనువారు
"ప్రభునిబిల్తు," నటంచు పరుగెత్తి జారి 50
పడి యొరుల పైఁ గలియుఁబడి తిట్టుభటుఁడు,
చెఱు వీఁద దిగువారు, చెవిటిబ్రాహ్మణుఁడు
గోలుచేయుచు నుండి, రీలీల నొకటఁ
బల్వి రచ్చుటఁ, బడవవాఁ డొకఁడు దప్ప.
కోలాహలంబునన్ ఘూర్ణిల్లఁ దీర, 55
మెక్కడో యనునట్టు, లెదుటనొకమేడ
పంచమూలను వాఁడు పవళించుచుండె.
వాని వెస లేపికొని వచ్చిరే కాని,
పడవ దీయఁడు వాఁడు, పతియాజ్ఞ లేదు.
"భటులు చచ్చుట, గిటులు పాఱిపోవుటయు, 60
నాకుఁ దెలియ ద దంత, మీా కేమి పోయె ?

ఏది, మొఱ యేది? నా కేమి వినఁబడదు;
సెలవు గైకొని వచ్చి చెప్పఁ డేమైన—.
ఎవ్వ రాచెలువులో, నేమి మీతలలు
బరు వైనవా యింకఁ బైకి రా రేమి?" 65
అని చేత నొకఱాయి యందికొని వాఁడు
విసర నుండెను—వచ్చె విభుఁడు యువరాజు.
ఏతెంచి గొడవ చేయెత్తి వారించి,
చాళుక్యవిభుసమాచారంబు దెలిసి,
బంధనాలయభటుల భంగంబు దెలిసి, 70
—పడవ సిద్ధము చేసె పడవవాఁ డంత—
అది యెక్కి చెఱసాల కరిగె నావిభుఁడు.
  అరిగి గొళ్లెము దీసి, "అయ్యయో! యింక
నిల్వ వీప్రాణముల్, నిల్వలే," యనుచుఁ
జాఁపకట్టుగ నేలఁ జాఁగిల్లుభటుని 75
గాంచి, చిత్తమునందుఁ గడుజాలినొంది,
దగ్గఱకుఁ బోయి వెస దయ వాని నెత్తి,
పాన్పుపై మెల్లగాఁ బండుకొనఁ బెట్టి,
దెబ్బ యెట్టిదో చూడ దేహంబు తడవి,
"కటాకటా!" యని గవాక్షము చేరి, కేక, 80
"వైద్యుఁ డొకఁడు వేగ, వైద్యుఁ" డని వేసె.
కేక వేసెను విభుఁడు, కేకతో లేచి,

భటుఁడుదిగ్గున నిల్చెఁ బతి తెల్లవోవ.
నిల్చి, "అయ్యో!" యనుచు నేలపై వ్రాలె.
వ్రాలి యెత్తఁగ నున్న రాజేంద్రుఁ జూచి, 85
"వద్దు వద్దో ప్రభూ, వద్దు శ్రమ వద్దు,
వద్దు వైద్యుఁడు వద్దు, వశము గాదింక,
ప్రభువువారిని గాంచి, వార్త వినిపించి,
మానేర మెఱిఁగించి, మన్నింప వేఁడి,
సెలవు గైకొన గొడవ చేసితిని గాని, 90
బ్రతికెద నని యాస పడి కాదు, కాదు."
అని సన్నగిలుకంఠమున నంతెఁ జెప్పి,
"బయటఁ జావనితావుఁ బాసి వచ్చితిమి,
చావ వెఱచినభటుఁడు చచ్చెననుమాట
మఱచిపోతిమి, వ్రతము చెఱిచితిమిగాని, 95
ఫలము దక్కఁగ లేదు—విలపింప నేల?—
మానంబుతోడిదే ప్రాణంబు గాద?
అది పోవ నిది భార మగు మహారాజ—
సెలవు, సెల వో ప్రభూ, సెలవు, నా కింక
దయచేసి సెల విండు, దయయుంచి చాల." 100

Character of Chola king is revealed here

# ౨. దేవీపూజ

పన్నీటఁ గస్తూరిఁ బంకంబు చేసి,
దేవితిన్నియ యల్కి, తేటముత్యాల
ముగ్గు పెట్టుచుఁ, బూలుఁ, బూసరుల్, పత్రిఁ,
బసుపుఁ, గుంకుమ, పండ్లుఁ, బసిఁడినాణెములు,
నక్షతల్, సాంబ్రాణి, యగరు, గంధంబు, 5
హరిచందనం, బింక నన్నివస్తువులుఁ
జక్కఁగా వేర్వేఱ సకియ సుమబాల
యల్లనల్ల నమర్చి, చంబ వత్సలత
బోధించు యోగీంద్రు పుణ్యకథ చెప్పె.
కథ సమాప్తం బయ్యెఁ, గథ చెప్పనంత 10
సేపు చాళుక్యమదిఁ జెప్ప శక్యంబు
గానియొకవిధ మైనకలఁత వర్తిల్లె.
కలఁత వర్తిల్లె, నాకలఁత కథలోని
విషయములచే నైనవిషయంబు గాదు.
కథ చెవులఁ బడుచుండెఁ, గాని నేత్రములు, 15
నేత్రముల నంటి వెన్వెంట హృదయంబు
పెనఁగొనియె వేఱొక్క విషయంబుతోడ.

కథ వినుచుఁ జోళరాకన్నె యాచెంత
నున్నయొక స్తంభమున నొకచేయి యాని,

ప్రక్క కొక్కింత దల వాల్చి, ముంగురులు 20
నునుఁదళ్కు లొల్కు నెన్నొసట నల్లాడ,
వదన మించుక యెత్తి, వాఁగనుల్ మెఱయఁ,
దడిజుట్టు విడి యార ముడి విప్పి, చిక్కు
కుడిచేతితోఁ దీసికొనుచు నిల్చుండె.
ఆరూపు, లావణ్య, మంగసౌష్ఠవము, 25
నాసౌకుమార్యంబు, నాయౌవనంబు,
నద్వితీయలకన్యాత్వసహజవర్చంబు,
లవి కంటఁ గని పురుషుఁ డంతరంగమున
ననురాగ మందు టది యాశ్చర్య మగునె?
కాని చాళుక్యు నాకర్షించినట్టి 30
దతివరూపము గాదు, యౌవనము గాదు;
వర్చంబు గాదు, లావణ్యంబు గాదు,
సౌకుమార్యము నంగసౌష్ఠవము గాదు ;
వీని నన్నిటి మించి, వీనిలో నిమిడి,
వీని నన్నిటిఁ గప్పి వీనిలో దాఁగి, 35
వీని నన్నిటిఁ ద్రోసి, వీనిలోఁ జేరి,
పొడచూపె నాతనికిఁ, బుట్టినది మొదలు,
నపు డపుడు మనమునం దానంద ముబ్బ,
నప్పు డప్పుడు హృదయ మతిరయముతోడ
దడఁ జెందఁ, బల్మాఱు తాను భావమునఁ 40

బొడగాంచి, స్పష్టముగఁ బొడఁగాంచ లేక
యున్నదానికిఁ బోలె నొకపదార్థంబు.
తెప్ప వాల్పక, కనుల్ విప్పి చూపులనె
యెదుటఁ గన్పడుదాని నెల్ల రాఁ దివిచి
వాంఛ దీఱఁగఁ గ్రోల వాంఛించురీతి, 45
వీక్షించుచుండె నావిమలుండు, తన్నుఁ,
దనస్థితియు, ముందు కర్తవ్యంబు మఱచి.
కథ ముగిసె, నన్నియుం గాంత సుమబాల
యాయితము చేసి, "రావమ్మ" యని లేచె.
అంత స్తంభముఁ బాసి యారాచకన్నె 50
కురులు వ్రేల్ముడి వేసికొనుచు, విగ్రహము
చేర నడుగిడి నిల్చి, చెలివైపు తిరిగి,
"నీవు చెప్పిన దంత నిజమయ్యెయుండుఁ,
గాని నే నన్నియది గా దనఁగ రాదు.
ఎప్పుడో యుగము కొక్కప్పు డెద మెచ్చి 55
గురుపదానందాదిపరమభక్తులకు
సంప్రీతి గావింప జగ ముద్ధరింప,
నెప్పుడో యుగముకొక్కప్పు డోర్పుడిగి
మహిషాసురప్రముఖమహితఘాతుకుల
సంహార మొనరింప, జగ ముద్ధరింప, 60
నాయాదిశక్తి దనయసమానమహిమ

చూపించి తా నుంట రూపించుఁ గాని,
ప్రత్యల్పసామాన్య పరిచరునికో అకు
గడియ తాళము దీసి కలఁ గానఁ బడునె?
ఆలయము దూఱు ప్రత్యల్పతస్కరుని 65
మెడ పట్టి గెంటుటకు మేదినికి దిగునె?
ఆనాఁడు చోళేంద్రు కగపడినయప్పు
డంబ పల్కినమాట కర్థ మీరీతిఁ,
దల్పు ద్వారము లేక, దడి యైన లేక,
యెంగిలాకులు గూడ నెగిరి లోపలికి 70
వచ్చిపడునట్టు,లీపావనస్థలము
నుంచవలె నని కా దహూరాత్రములును."
అనుచుఁ బల్కెడుకుందవాంబికాకన్య
కంఠమృదుమధురనిక్వాణముల్ విమలు
మది తొంటికంటెఁ దార్కాణు చెందించె. 75
కాని యాతార్కాణు కలిగించినట్టి
దతివకంఠమునుండి యమిత మై యొల్కు
మాధుర్యమును గాదు, మార్దవము గాదు.
మాధుర్యమును మించి, మార్దవముఁ గప్పి
మాధుర్యమున నిమిడి, మార్దవములోన 80
దాఁగి యుండినపదార్థంబొకటి యతని,
"ఏల యీాకలవరం, బెఱుఁగవా నన్ను?"

అని పల్కరించుచున్నట్లు వినఁబడియె.<br>
  రాత్రివేళను మహారణ్యంబులోన<br>
దారి తప్పినబాటసారి, బహుదూర  85<br>
మం దెవ్వరో మాట లాడుచున్నట్లు<br>
వినిపింప, మనుజులో వృక్షమర్మరమొ<br>
—ప్రాణముల్ దక్కుటయొ వనముపా లగుటో—<br>
నిర్ణయింపఁగ లేక, నిల్చి చెవి యొగ్గి,<br>
వినురీతి విమలుండు వినుచు నిల్చుండె  90<br>
నువిద యింకే మేమియో పల్కుచుండ.<br>
కదలక నిల్చుండెఁ, గాని యపు డపుడె<br>
బయట నణఁగినగాలివానల్లోఁ బ్రబలె.<br>
ఆయల్లకల్లోల మఱఁచికొన నెంచి<br>
తరుణికట్టెదుటఁ బడి తనయదృష్టంబు  95<br>
తరుణినోటనె తెలియ ధైర్యంబు చేసి<br>
విమలుఁ డప్పుడు మఱుఁగు విడిచి వెల్వడఁగ<br>
నడు గెత్తె నంతట నాక్షణములోన<br>
నంబికారాధనం బారంభ మాయె.<br>
ఎత్తి యుండినచరణ మెత్తి నట్లుండ  100<br>
నిల్చి హస్తద్వయము నిటలమునఁ జేర్చి—

దండకము.

  "జయ జయ జయ కోటదుర్గాంబ,<br>
జగదంబ శర్వాణి మాహేశ్వరీ గౌరి, కాత్యాయనీ, కాళి,<br>
రుద్రాణి, దాక్షాయణీ, పార్వతీ, చండికా!  105

చండీమహాశక్తి, నాయుల్లమందుండుమీా, నీదు
తీవ్రప్రతాపానలజ్వాలజాలోగ్రవిస్ఫూర్తికిఁ మ్రొ
క్కెదఁ !

ఓ దేవి యాబ్రహ్మదేవుం డపారప్రభావంబునన్
సృష్టినిర్మాణముం జేసి, లోకంబునం దెన్నియో జంతు 110
సంతానముల్, వస్తుసందోహముల్, మాదుసౌఖ్యార్థ
మై, నిల్పెనే కాని ; ఆశారదామాత విజ్ఞానసంధాత్రి
ప్రేమన్ బ్రసాదించి యుత్కృష్టప్రజ్ఞావిశేషంబునం జేసి
తద్వస్తుజంతువ్రజం బంతయుఁ మాకు స్వాధీనమై
యుండునే కాని ; ఆయాదివిష్ణుండు శ్రీమానినీకాంత 115
యుఁ గూడి తత్సర్వవస్తువ్రజంబుఁ సదా జంతుజాలం
బులఁ బెంచుచున్, మాదు ప్రజ్ఞావిశేషంబు పోషించు
చుఁ, ఆయురారోగ్యముల్ సంపదుత్సాహముల్
మాకుఁగల్గించుచుఁ, మేము మౌఢ్యంబునన్ నిత్యముం
జేయుదోషంబులఁ బాపపుంజంబులన్ సైఁచుచుఁ,120
గీడు మాజోలి కెన్నండు రాకుండఁగా మమ్ము రక్షిం
చుచుఁ, బ్రీతితో నిట్లనేకప్రకారంబులఁ మాకు
సౌఖ్యానుభోగంబు సాధ్యంబు గావింతురే కాని ;
మీాదంపతుల్ – నీవునో చండికాదేవి, నీనాథుఁ డౌనావి
రూపాక్షదేవుండు — కాలంబు కన్పట్టి, జీర్ణంబులై, 125
దార్ఢ్యహీనంబులై, నైజధర్మంబులన్ వీడి లోకాభి

వృద్ధిన్ నిరోధించు వస్తువ్రజంబున్ సదా జంతుజాలం
బులన్ నాశ మొందించుచున్ భూమిభారం బణంగిం
చుచున్, నూత్నవస్తువ్రజంబుల్ సదా జంతుజాలం
బులన్ సంభవం బందఁగా, నూత్నవైచిత్ర్యముల్ 130
నూత్నసంయోగముల్ నూత్నవిన్యాసముల్ వర్థిలంగా
ననేకావకాశంబులన్ గూర్పకున్నన్, మహాశక్తియీ
సృష్టిపరిణామసంసిద్ధియే లేదులే దమ్మ,మీచండకా
రుణ్యమార్గంబునం గాక దేవీ మనుష్యాళికిన్ మోక్షసం
సిద్ధియే లేదు లేదమ్మ, తల్లీ నమస్తే, భవానీ నమస్తే, 135
మృడానీ నమస్తే, నమస్తే నమస్తే నమః॥

చెలియ శంఖం బూఁద, జేగంట మ్రోఁగ,
దీపంబు వెలిఁగించి, ధూపంబు వేసి,
యీరీతి గా నప్పు డారాజకన్య,
ధూపవాసనలచే దుర్గాలయంబు 140
నిండుకొన, నెఱుఁ గెత్తి దండకముఁ జదివి,
కీర్తనల నాతల్లిఁ గీర్తించి,కృతులు
పాడి, కుంకుమఁ బూలఁ బ్రతిఁ బూజించి,
పట్టువస్త్రంబు లాభరణముల్ పెట్టి,
ఫలములు నివేదించి, పసుపు తాంబూల 145
మర్పించి, కర్పూరహారతు లిచ్చి,
మంగళము పాడి, సాష్టాంగంబుఁ జేసి,

నిల్చి చేతులుమోడ్చి నెన్నుదటఁ జేర్చి,
యతిసునిశ్చలభక్తి నంబ నొకక్షణము
ధ్యానించి చిత్తమునఁ, దల యెత్తి చూచి— 150
యుల్కి పడె రాకన్నె, యుల్కిపడె బాల.

---

# ౯. సమావేశము.

కని యెఱుంగనిమోముఁ, గనుల నెల్లపుడుఁ
గట్టి యున్నట్టియాకలికియందంబుఁ
గనుల నిజముగ నిపుడు గాంచి విమలుండు;
విని యెఱుంగనిపల్కు, వీనులనెపుడు
వీణియల్ మీటించువెలఁదికంఠంబు 5
వీనుల న్నిజముగా విని విమలుఁ డిపుడు;
ఇలపైని బుట్టినది, యెపుడు పుట్టునది
యెఱుక లేనట్టియాయింపురూపంబు
ఇప్పుడు కట్టెదుట నొప్ప విమలుండు;
కని యెఱుంగనివనిత, విననట్టివనిత 10
మన సెల్లయు న్నిండి మన సెల్లఁ గొన్న
వనిత కట్టెదుట నిల్వంగ విమలుండు
నిశ్చేష్టుఁడై తాను నిల్చుండెఁ, దన్నుఁ
దనస్థితియు, ముందు కర్తవ్యంబు మఱచి.
మఱచుటా? సర్వంబు మాఱిపోయెనుగ? 15
తానుఁ దనస్థితియుఁ, గర్తవ్యంబు మాఱె.
మాఱిపోయెను బ్రతుకు, మాఱె లోకంబు,
మాఱె నాదర్శముల్ మాఱె మార్గములు;
మాఱె; నొక్కొక్కక్షణమహిమ యట్టిదిగ;
ఒక్కొక్కక్షణమహిమ మొక్కొక్కహృదయ 20

పరిణామమహిమంబు పరిశోధనంబు
చేయ నెవ్వరితరము, చేయ ఫల మేమి!
ప్రాణంబుతోఁ జెఱకుఁ బో నంటిఁవౌర!
ప్రాణంబు లొడ్డియున్ భటులతోఁ బోరి,
బహుశ్రమంబున కోర్చి పాపి కొన్నట్టి 25
చెఱను మించినచెఱను జిక్కితివి కదర!
నీభాగ్యభోగముల్, నీవైభవములు,
నీప్రజలసౌఖ్యంబు, నీదుదేశంబు,
నిను నమ్మి పోరిన నీనేన లకట!
ఇంతలో వీనియన్నింటియాచింత 30
కాంతహృదయం బెట్లు కరఁగునో యనెడి
చింతలోపల మునిఁగి చివికి పోయెనుర!
మిన్కుమిన్కుల నింగి మెలఁగు చుడుపాళి
శాంతి యానందంబు చాల సమకుఱుచు,
ధగధగల్ ప్రబలంగ ధాత్రిపై రాలి, 35
శాంతి యానఁదంబు చాలఁగాఁ జెఱుచు;
అల్లె పరిల్లునరుఁ డాసక్తిఁ గోరు
కోరికల్ నెఱవేర్చుకొనునాస తీరు;
దవ్వుదవ్వున నుండి దాఁగురుమూఁత
లాడు చోకవిధ మైనహాయి మదినించు, 40
దాఁపుదాఁపున రూపు చూపి తలపోఁత,

తలపోఁతతోడ మదిఁ దడఁబాటు పెంచుఁ
దడఁబాటు చెలరేఁగి ధైర్యంబుఁ ద్రుంచు,
భయము వెన్వెంట సంశయము పఱతెంచు,
దానివెంబడి మరలఁ దలపోఁత మించు. 45

కనుల నందముఁ జెవులఁ గంఠంబుఁ బడిన
యంతమాత్రానఁ గళ్యాణ మలవడున !
భాసిల్ల మెఱుపులు పండునా పైరు,
నీటితెమ్మెరరవళి నిండునా యేఱు !

ఎవ్వరో యాకాంత యేమి కారణమొ, 50
యచటికే తెంచుటకు నట్టినిసివేళ ?
పరమేశ్వరిం గొల్వ పనులు లేకుండఁ
జూచుకొని విచ్చేసె సురవధూమణియొ ?
సురవధూమణియైన సుమబాల యేమి ?
కాకున్న నాదివ్యకమనీయతేమి ; 55
—ఆహా ! యహంకార మన నదే కాద !
మర్త్యమాత్రుఁడు దాను, మర్త్యభామినిగఁ
దాను రచియింపఁ గలతరుణీలలామ
స్వర్గభామిని గాని చాలఁడే రచనఁ
జేయఁ, దన్నే రచనఁ జేయఁ గలవాఁడు, 60
సర్వజ్ఞుఁ డగువాఁడు, సర్వశక్తుండు ?—
ఔ నౌను, గాదు కా, దనుతర్కమేల,

సురవధూమణి యన స్వైర పొంద నేల,
మానవాంగన యనం బరితోష మేల ?
దివ్య భాగీరథీదేవి శంతనుని 65
బరిణయం బాడదే ? సురలోకవిభుల
ప్రార్థనల్ దమయంతి పాటించె నొక్కొ ?

* * * *

వనితకుల మేదియో, వంశ మెట్టిదియొ ?
చనువుగా సుమబాల చనుదెంచె వెంట,
రాజశుద్ధాంతంపురమణి యై యుండు ; 70
రాజశుద్ధాంతంపురమణి యే యైన,
సఖజనము లేరి, పూజారియున్ రాఁడొ ?
సుమబాల చనువుగాఁ జోళపురిలోనఁ
జేరి మెఱుఁగనియట్టిచేడియల్ గలరె ?
ఔ నౌను, గాదు కా, దనుతర్క మేల ? 75
వర్ణంబు లెంచునే వర్షాంబుధార,
వంశంబు లరయునే వాయుప్రసరంబు,
వయసు గణియించునే భానుకిరణములు ?
తత్తుల్యమే పురుషచిత్తానురక్తి.
అనురాగతత్పరుం డైనపూరుషుని 80
హృదయమున కాహద్దు నీహద్దుఁ గలదె,
కన్య హృదయాభిమతగతియొకటి దప్ప ?

కనిపించునది గాదు, విన వశము గాదు,
కన్య హృదయాభిమతగతి మెఱుఁగు టెట్లు?
ఎఱిఁగి చేసెడికార్య మే మున్నదో, గన్య 85
చిత్త మన్యార్పణము చేసియే యున్న?
సతతంబు ముఖపూర్ణచంద్రికాద్యుతుల
నయనోత్పలంబులకు నానంద మొసఁగి,
సతతంబుఁ గంఠప్రసన్నసలిలముల
శ్రవణశుక్తుల కమితసంతోష మొసఁగి, 90
చిత్త మన్యార్పణము చేయునే కన్య?
ఔ నౌను, గాదు కా, దనుశంక లన్ని
దీర్చికొని సత్యంబు దెలిసికొన నెంచి,
విమలుండు తనమఱుఁగు విడిచి వెల్వడఁగ
నదు గెత్తె నంతట నాక్షణములోన 95
నంబికారాధనం బారంభ మాయె.
ఎత్తియుండినచరణ మెత్తి న ట్లుండ
నిల్చె హస్తద్వయము నిటలమునఁ జేర్చి;
నిల్చె ఘంటాశంఖనినదంబు మ్రోఁగ,
నిండుకొన ధూపముల్, దండకప్రముఖ 100
కాళికాస్తవగీతి కారవం బెసఁగ.
నిల్చె, సేవాంతంబు నిల్చె మో మెత్తి,
చేతులు నెన్నుదటఁ జేర్చి నిల్చున్న

కాంత నవలోకించి, కాగడా దీసి
బయలు దేఱఁగ నున్న బాలికం జూచి, 105
విమలుండు తనమఱుఁగు వెల్వడి వచ్చి,
సురుచిరోన్నతమూర్తి, వరలలాటంబు,
విపులలోచనయుగము, పృథులవక్షంబు,
నవయౌవనోద్దీప్తి, నైజతనుదీప్తి,
హస్తకీలితశస్త్రనిస్తంద్రదీప్తి 110
యతిశయిల్లఁగ నిల్చె, నపుడు క న్దెఱచి
యుల్కె రాజతనూజ, యుల్కె సుమబాల —
యుల్కిపడె విమలుండు, నుల్కె తడబడియె.
తీర్చికొన నున్నసందేహంబు లన్ని
దీఱిపోవుట, కయ్యొ ! మాఱుగా నిపుడు 115
కాంత కన్యకయౌనొ కాదొ యనునట్టి
క్రొత్తసందేహంబు చిత్తమునఁ దోఁచె.
పాఠ మంతయుఁ జదివి బడి కేగుదెంచి,
యాచదివినది యుపాధ్యాయుఁ జూడఁగనె,
మఱచి తడఁబడుబాలుకరణినొకపైన, 120
నయ్యయో ! నోట మాటాడ లేకుండె.
అట్లొక్కక్షణ ముండి, యాననము వాల్చి,
మరల వెన్కకుఁ దిరిగి, మఱుఁగు వెసఁ జొచ్చె.
ఉల్కిపడి సుమబాల యుల్ల మొకవరుసఁ

గొట్టుకొన, నేత్రముల్ మిట్టి పై కుఱుక, 125
దౌడ గడగడలాడఁ, దను వెల్ల వణఁక,
దిగ్గుమని కుందవాదేవి హస్తంబు
పట్టి యీడ్వఁ దొడంగె ద్వారంబుదెసకు.
అది చూచి, యాకుందవాంబ, "ఇది యేమి?
బాల నీకిటువంటిభయ మన్నమాట 130
మెఱుఁగ నెన్నఁడుఁ, జోరుఁ డెవ్వఁడో రాఁగ
నిట్లు వెఱ పొందుటిది యెంత యపకీర్తి?
చాలుఁ జా లీభయము, చాలింపు మింక,
నవలసందడి యేదో యగు నట్లు దోఁచు,
పోయి భటులకు కేక వేయవే వేగ." 135
అని పల్క, సుమబాల యతిప్రయత్నమున
గద్గదస్వరముతో "కాదు కాదమ్మ—
రావమ్మ—తడయక—రావమ్మ—దేవి—
కాఁడమ్మ—చోరుండు—గాఁడు—చాళుక్య—
రాజు—"అని పైమాట రా కూరకుండి, 140
ముందుకంటెను గంప మొందుచు న్నిల్చె.
ఆమాట లాలించి యాకుందవాంబ,
"కుదురుచున్నది వెఱ్ఱి, ముదిరినది తెల్వి,
యవివేకి యనుకొంటివా వేఁగివిభుఁడు?
చేతఁ జిక్కినసుఖము చెఱలోన విడిచి 145

—దాఁగియున్నది స్వేచ్ఛ దాని శాసించి—
బయటఁబడి యీరీతిఁ బరుగు లిడువాఁడె ?
అంతెకా, చాళుక్యావనీశ్వరుఁడు
విమలమహౌదార్యవిఖ్యాతుఁ డంట,
ఆదిత్యవిక్రముం డఁట, యట్టిఘనుఁడు 150
అబలలను జడిపింప నరుదెంచునటవె ?
యరుదెంచి తా జడిసి పరుగెత్తునటవె ?
లేదు లే, దావిభుఁడు లెస్సగా నిపుడు
నిద్రించుచున్నాఁడు నీచింత లేక."
అని పల్కి, సుమబాల యశ లధిక మాట 155
గాంచి, "చాళుక్యులే కానిమ్ము, మనము
పల్లవులమా శిరసు వాల్చి భీతిల్ల !"
అంత నెట్లో బాల యతిప్రయత్నమున
గద్గదికతో మరల, "కాఁడు చాళుక్య
భూవిభుఁడు—గాఁడు—భూ—భూతమోయమ్మ, 160
పదవమ్మ తెగు—బాటు—కదను—గాదిపుడు."
వదనంబు చిట్లించి, వాఁడి చూ పెసఁగ,
బాలభుజ మాకాంత పట్టి జాడించె.
"నిజము, నిజ, మోదేవి—నీకు వందనము—
రావమ్మ చెప్ప నో రాడదో తల్లి, 165
వినవమ్మ నే మొన్న వింటి విమలుండు

పెండ్లికొడుకుబడఁ డాయె, బింకంబు లాడె—
ఉగ్రుఁడై యంతట యువరాజవిభుఁడు—
ఏని పోతర మణఁతు, వీని బలి యిచ్చి
కోటదుర్గాదేవిఁ గొల్తు నని పల్కె ; 170
ఎంత పని ఎంత పని, పంతంపుమాట
లనుకొంటి నయ్యొ ! తా నన్నంతఁ జేసె”
చెవులనావచనముల్ చీలికల్ సేయ,
“హరహరా !” యని విగ్రహముఁ జూచి, “నీకు,
కరుణాకరీ, యిట్టికార్యముల్ ప్రియమె ? 175
నీతి వీడుటె రాజనీతితత్త్వంబు ;
హరహరా ! యెటువంటిదురితమోహాది !”
అనుచుఁ జోళకుమారి యవనిపై వ్రాలి
మూర్ఛిల్లె బాలిక మొఱదిశల్ మ్రోఁగ.
మొఱ వెట్టె,రాజసుతమోముఁ దోయములఁ 180
దడుపుచు, నదిరిపడి తల యెత్తి కాంచె
నొకప్రక్కఁ జాళుక్య, నొకప్రక్క యోధ
ప్రముఖుఁడై వచ్చినరాజేంద్రచోళు.
ఒండొరుల వీక్షించు, చొక్కొక్కమాఱు
దృష్టు లాతరుణిదెసఁ ద్రిప్పుచున్,భటులు 185
నివ్వెఱఁగుపడి నిల్వ, నిల్చిరా రాజ
తనయు లిద్దఱునొక్కతడవు—చాళుక్య

విభుఁ డంతటను బల్కె, "వినుము రాజేంద్ర,
భావింపఁ జాల నీభావంబు తెన్ను ;
కాని యిచ్చట నీకుఁ గాన్పించుదానిఁ 190
దెలియవలె నన్న, నేఁ దెలిసినది యంతఁ
జెప్పెద—దైవకృపఁ జెరసాల నుండి
వెల్వడి నగరంబు వెల్వడఁగ నెంచి,
వచ్చితి నీత్రోవఁ జొచ్చితి నిందు
వనితలు రాఁ జూచి, వారు నిటె వత్తు 195
రని యెఱుఁగ నిది దేవి యాలయంబనియు—"
—కాంత యప్పుడు దేఱి, కను విప్పి చూచి,
సంభ్రమించుచు లేచి, స్తంభంబునీడఁ
జేఱె—చాళుక్యుండు చిఱుత చిఱునవ్వు
వదనమున మిన్కాడ, వచియించె మరల— 200
"అబలలను జడిపింప నరుదెంచ లేదు,
ప్రబలుండ వగునీకుఁ బరుగెత్త నిపుడు.
చండికావిగ్రహముచాటున న్నిల్చి
వేచి యుండఁగ నాకు గోచరం బయ్యె
బాల్యంబునుండి నాభావ మందుండి, 205
హృదయ మంతయు నిండి,హృదయంబుఁ గొన్న
సుమనోహరస్వరూపము కంటియెదుట.
మై మఱచి చిత్తమునసమర్పించునాన

మఱుఁగు నిడిచితి, సంత మదిలోనఁ దోఁచెఁ
గాంత కన్యక యౌనో కాదో యనుశంక; 210
ఆసంశయమున మాటాడ లేకుండ,
మూర్ఛిల్లెఁ గాంత నే భూత మని జడిసి."
అని చెప్పి యాతఁ డిట్లనియె, "రాజేంద్ర,
విను మింక నొకమాట—నీ బలి యిచ్చి
కోటదుర్గాదేవిఁ గొల్తు నని మున్న 215
ప్రతినపట్టితి వఁట—బాలలను బంపి
కడఁగుము నీపనికిఁ దడయంగ నేల?
నీచేత ఖడ్గంబు, నాచేత నిదిగో,
సైనికుల్ నీకు, నిశ్చయమె నారక్ష."
అని కాంతలను జూచి యంత, "సుమబాల, 220
మందభాగ్యుని విభులు మఱవకో యమ్మ.
ఓతరుణి, నీ వెవ్వరో కాని నిన్నుఁ
దెలియకే సతతంబుఁ దెలిసియే యుంటి.
దాన నెట్టిది యైనఁ దప్పిదం బున్నఁ,
గారుణికచిత్తమున క్షమియించి నన్ను 225
మందభాగ్యుని విభులు మఱచి సెల విమ్మ."
అని పల్కి చాళుక్యుఁ డంబికకు మ్రొక్కి,
కాంతలనేత్రములఁ గన్నీరు దొలఁగ,
జా గింక నే నోర్వఁ జాల, లే లెమ్ము,

అనునట్లు చోళున కభిముఖుండయ్యె. 230

ఆశ్చర్య, మాశ్చర్య, మాచోళుఁ డంత
శస్త్రంబు దిగ విడిచి శాత్రవుం జేరి,
హస్తముల్ పట్టి యి ట్లనియె, నుప్పొంగి
కాంతలనేత్రములఁ గన్నీరు దొలఁగ—
"జననిసన్నిధి నేఁడు చాళుక్యచోళ 235
రాజ్యవైరంబు సర్వంబుఁ గడతేఱె.
వేర్వేఱుమార్గముల వేర్వేఱుగతులఁ
ద్రిమ్మరితి మొండొరులఁ దెలియక, తుదకుఁ
గలిసికొంటిమి, మనగమ్య మొక్కటియె."
అని మోవిపై మందహాస మల్లాడ, 240
"వివరించినా విచటి వృత్తాంత, మింక
వివరింపవలె నీకు వృత్తాంత మొకటి,
వివరింతు, నగరికి విచ్చేసి, రాజ,
—శుభ మింటఁ దలపెట్టి చోళవల్లభుఁడు,
సుమబాల తలపెట్టె సుమగాన మపుడు 245
మావింద వై యుండి మాపేడ్క దీర్చి
పోవచ్చు మీ వేఁగిపురి," కనియె నంత—

పాట

"ఎన్న శుభముల కెల్లతావుల
చె న్నెసఁగ నాచేతిపూవుల 250

దండలే కాదా యొసంగెదు,
చెండులే కద శ్రీ లొసంగెదు!
వేకువను గావేరికిం జని,
లోకహితు సుశ్లోకు నామని
దలఁచి, పసుపులకలికిబెళుకుల 255
నలఁది స్నానం బాడి, తళుకుల
పట్టువస్త్రము గట్టి కుంకుమ
బొట్టు నుదుటను బెట్టి సంకుమ
దం బిడిచందనము పూసి, క
చంబు వ్రేల్ముడి సరగ వేసుక, 260
పిల్లగాలులచల్లఁదనమున
కొళ్లు పులకర మొంద, మనమున
హాయి యొక్కటి యమరఁ, దోఁటకుఁ
బోయి చెచ్చెరఁ బులుఁగుపాటకు
నిం పయిన సుతులీనుతుమ్మెద 265
గుంపుతోడను గూడి సమ్మద
మున లతాద్రుమములను డాయుదుఁ,
దనివి గాఁ గ్రొన్ననలు గోయుదు;
కోసి చోళమహీశు ప్రియసుత
యాస చేయుహిమాద్రి ప్రియసుత 270
పూజకై కొని పోదు నానుమ

రాజమానసరంజనంబమ ! ॥ఎన్న శుభముల ॥"

గానంబు తుద ముట్టఁ, గాళికాదేవి
కందఱు ప్రణమిల్లి యానందమతుల
వెడలిరి,—సుమబాల వెడల దట నుండి. 275
"ఇంక నిచ్చట మసల నేల ?"యని రాజ
కన్య పిల్వఁగ, బాల కరయుగము మోడ్చి,
"అమ్మ, దుర్గాదేవి యాజ్ఞ నా కయ్యె ;
నేఁడు మొదలంబసన్నిధియె నాగృహము,
దేవిసేవయె నాకు జీవనాశయము ; 280
పసితనమునుండి మీపాపనై పెరిఁగి
యన్నివిధములసౌఖ్య మనుభవించితిని,
జననిపూజాసౌఖ్య మనుభవింపఁగను
గోర్కి జనియించె ; నాకోర్కులన్నింటిఁ
దీర్చుచుంటిరి, ఋణము దీర్చికొనలేను ; 285
ఎప్పటికృప యుంచి యీకోర్కి దీర్చి
దీవించి సెల విచ్చి, నావందనముల
నమ్మగారికి మధురాంతకమ్మకును
నర్పించి సెల వీయు మని చెప్పవమ్మ.

* * * *

శుభము తలపెట్టె నఁట చోళవల్లభుఁడు, 290
శుభమునకు వచ్చి యావిభవంబు గనులఁ

గాంచి, సుమగానంబు గావించుదాన,
ఈశుభంబునఁ గల్గునెన్నియో శుభము
లమ్మనీగర్భవాసమ్ము ఫలియించి
పుత్రులుఁ, బౌత్రులు, భూరివిక్రములు, 295
విమలవిచారులు, విబుధపోషకులుఁ,
బార్వతీపతిపదాబ్జాతతత్పరులు,
సభయకులదీపకులు, సత్తుంగయశులుఁ,
జాళుక్యచోళసమ్మేళనోద్భవులు
నుదయింతు, రట భానుఁ డుదయించురీతి!" 300

ఓమ్

శాంతిః శాంతిః శాంతిః

హరిః ఓమ్.

శ్రీ సత్యానందప్రెస్, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శయనగృహంబున; సలుపుదు
నియతిం బారాయణంబు నే రాతిరులన్. 229

క. చక్కెరబొమ్మ యిగో ! కను !
చక్కని సరసులఁ గ్రయించు జతనముతోడన్
మిక్కిలియగు మెయిపెక్కుల
రొక్కముతోఁ బణ్యవీథిఁ గ్రుమ్మఱుచుండెన్. 230

ఆ. స్వకరరేఖ లరసి సాముద్రికుఁ డొకండు
"బాల ! సుభగ వీవు పలుకనేల ?"
అని వచింపఁ గన్నె మనసున మురియుచు
"నది ఫలించు నెప్పు" డంచు నడిగె. 231

క. ఇది యామయమొ ? యనుక్షణ
మెదుగుచు నీ చన్నుదోయి యిముడదు రయికం;
దుదిమొగము మూఁత వడునో ?
సుదతీమణి ! పట్టి యొత్తి చూచెద రమ్మా ! 232

క. బంతాటయందు విసరితి
బంతిని నే నొకటి; జోడుబంతులు విసరెం
గాంతామణి; నా చేఁతకుఁ
బంతంబున నిబ్బడిగను బ్రతి నేయు నిటుల్ 233

ఆ. అక్కపురుడు పోయ నరుదెంచి చెల్లెలు
సవతి యయ్యె నాల్గు దివసములకె;
పట్టమహిషి యయ్యెఁ బదినాళ్ళ; దాని సౌ
భగము సూచుచుండఁ బగలఁబండె. 234

ఆ "చిట్టిపాప! నాకుఁ జెపు మమ్మబిడ్డవా?
నాన్నబిడ్డవా?" యనంగ నదియు
"నమ్మబిడ్డ" నంచు ననె "నెట్లు దెలిసె ర
హస్య?" మంచు నవ్వి రచటి చెలులు. 235

క. ప్రియురాలి యుత్తరీయముఁ
గయినేసి కురంగనాభి గంధిలమును రా౯
జయజయనాద మొనర్చుచుఁ
బ్రియులు నను౯ మెచ్చుకొనిరి కృతపుణ్యునిగా౯. 236

గీ. "ప్రియుఁడ! నాయాటఁగట్టింతువే? యెది? యెది?
ఆడుదము రమ్మ! చదరంగ" మనుడుఁ బడఁతి
"కాదె చిత్రంబు? ప్రేయసీ! కలికి యెట్లు
పురుషుఁగట్టించు?" నన నవ్వు మోముఁ దాల్చె. 237

క. "వినలేదె? సఖీ! 'కళ్యా
ర్చిన దిల్లార్చు' నను బుధవరేణుల సూక్తి౯"
అన నగుచుఁ బ్రియుం, డా జ
వ్వని కళ్యార్చును గడింది పకపకనగుచు౯. 238

గీ. చెలువ మృదుగాత్రయష్టి నిశ్రేణినట్టు
లెట్టకేలకు నెక్కి; నెట్టెట్టొ దిగును;
మరలనెక్కును; దిగుచుండు మరల నట్లె
వెడఁగునుంబోలి నాచూపు పెద్దసేపు. 239

క. "ఎది కావలె నీ?" కనఁ బ్రియుఁ
"డది కావలె" ననియె నగుచు నబ్జాస్య, యతం

"ఢదియే?" మన "నది? యదె?" యని
ముదిత నగ౯ మెల్ల నతఁడు ముద్దిచ్చి చనె౯. 240

చ. అల ప్రతివేశికాంతకు
గృహంబున నిద్దుర పట్టదంట; య
న్నెలవున నగ్నిమధ్యమున
నిల్చిన యట్టులె యుండునంట; శీ
తల పవనంబు సోఁకుచు
సుధాహ్రద మట్లు నెలంగునంట మా
యిలు; వచియించు చివ్విధి
శయించుఁ బగంటను వచ్చి వేసవి౯. 241

గీ. పద్మపత్త్రాయతంబులై పరిఢవిల్లు
చారులోచనయుగళంబు చాలకేమొ?
తాల్చి యుపలోచనములను దరుణకోటి
వాడవాడల శోధించుఁ బద్మగంధి. 242

క. దిక్కులఁ గ్రక్కఁగఁ గురువుల
చక్కందనమెల్లఁ బట్టుజాలెపరికిణీ;
ఔక్కెంబన వలపేనికిఁ
జక్కనిచుక్క యిదె! చంద్రశాలఁ జరించు౯. 243

క. బలిసి, కడు విఱ్ఱవీఁగుచు
లలితములయి, పఁసిడిగింఁడ్ల లాగునఁ దగు గు
బ్బల నద్దంబునఁ గాంచుచుఁ
గలికి తనదు భాగ్యమునకుఁ గడుఁగడు మురియు౯ 244

ఆ. ఒక్క యచ్చున దించిన ట్లింద్రు నాదు
నిగురుఁబోడియుఁ బ్రక్కింటి చిగురుఁబోణి
నన్ను భ్రమగొల్పుచుండు నా వన్నెలాఁడి
తాల్చు వల్వలు నాచెల్వ దాల్చినట్లె. 245

క. అమవస నిసియేనియుఁ బు
న్నమనిసియే నాకు; వెలుఁగ నా రమణీ ర
త్నము రమ్యముఖేందువుతోఁ,
గమనీయస్మితము పేరి కౌముదితోడన్. 246

క. వ్యవహారదశను ద్వైతం
బవనిం బరమార్థమందు నద్వైతమ; మా
కవ కద్వైతమె సర్వ
వ్యవహారావస్థలందు భాసిలుచుండున్. 247

క. "మేకువలె నుంటి విందా
కేకైతి విదేల"యనుచు హృదయేశుఁ డనన్
ఏ కెప్పుడు మేకయ్యెనొ
మేకేకగు టెఱిదె?" యంచు మెలఁతుక నవ్వెన్. 248

చ. ఒకపరివచ్చి యద్దమున
కున్ముఖియై సవరించి ముంగురుల్;
ఒకపరివిప్పి రైకను
మఱొక్కటిదాలిచి; దిద్ది హారముల్
ఒకతఱిఁ జీరమార్చియు
మఱొక్కవితంబుగఁగట్టి; యద్ది నె

మ్మొకమున గంధచూర్ణమును
ముద్దియ నాకిడు వచ్చి ముద్దులన్. 249

క. ఒకకంటి కిడితి కాటుక;
నొకచెవికే కమ్మఁదొడిగి; తుంచితివి విశే
షకమును సగంబె; శేషం
బిఁక ననుఁ బూరింపమందువే ? పూఁబోఁడీ! 250

క. "పొరుగింటిపడుచుఁ దన చి
త్తరువుసరస నిలుపుకొనియెఁ దమిమెయి నీ చి
త్తరువు దొరా! రొమ్ములనిడి
పరుండు రే"లంచు దాని వరవుడు నొడివెన్. 251

గీ. ఆకుఁబచ్చని జిలుఁగుచీనాంబరంబుఁ
జెలువ మెగఁబోయు భూషణావళియుఁ దాల్చి
తరుణి తలవాఁకిటను నిల్వ విరు-తోడి
పూలమొక్క-ని యనుకొంఁద్రు మొదటఁ గాంచి. 252

క. దిగుచుంటి నేను నామే
నగోడ లెదురెక్కు-చుండె నా మాడువు మె;
ట్లొగిఁ గలిసితి మిఱుకటమునఁ
మొగములు గ్రుచ్చికొనె నధరముల్ చిక్కు-వడెన్. 253

క. చెలి నను ధ్యాతను వెనుకొని
బలుగుబ్బలు గ్రుచ్చఁ గొంత వడి సైఁచియు ని
ట్టులు గాదనుచు నెదుర్కొ-నఁ
గిలకల నగెఁ గ్రిందఁబడియు గెలిచితి ననుచున్. 254

ఆ. త్రొమ్మ విఱిచి కొమ్మ నెమ్మొగమ్మును వాంచి
చనులపైపుఁ జూచుకొనుచు మెచ్చు
వాని బలుపుఁ బొలుపు, వాని మిటారంబు,
వాని గుండ్రతనము, వాని మిసిమి. 255

గీ. మగువ కోమలికముఁబట్టి చిగురుఁగొమ్మ;
అగును బో! చింతకొమ్మ మైబిగువుఁబట్టి;
చిగురుఁగొమ్మైన చేవంట సెల్లు నిటనె;
పుణ్యలభ్యమ్మ గద! యిట్టి ముద్దుగుమ్మ. 256

క. ఇంతలు గన్నులు గలిగియు
నింతి జనులపైకె నడచు; నెగదట్టెనొ నే
త్రాంతముల గాథయౌవన
సంతమసము? మూఁతవడెనొ? చనుదో యెత్తై. 257

ఆ. రామకోటి వ్రాయ రాము ననుగ్రహం
బనయమగు నటంచు నాలకించి
కామకోటి వ్రాయఁ గాము ననుగ్రహం
బేలకలుగ? దంచు నింతి వ్రాయు. 258

క. "చనుమొనలు నల్లఁబాఱెను;
గనుఁగవకు గానరాని కౌను బలిసె నే?"
లన దూతి నగుచు జవ్వని
యనెఁ "గృప నీ విడిన విటమహౌషధసేవన్." 259

క. చెలి! చీర నెంత దాఁగిన
లలితంబగు నీదు మేను లక్షింతున; యా

కులచాటున నునుదీవియ
వలెఁ గానంబడియుఁ గానఁబడక మధురమై. 260

క. తొరతొరగ నేగుచుంటినిఁ;
తొరతొరగా నెదురువచ్చెఁ దోయజముఖి; యో
ర్తిఱుకగు సందది; గాత్రము
లొరసెం; జేఁజిక్కెఁ జెఱఁగు; లూఁగితి మిటటుల్. 261

ఆ. ముద్దబంతిపువ్వు పోల్కని బొద్దుగా
నొప్పు పొరుగుటింటి యొప్పులాఁడి
లేడిపిల్లవోలె గోడదాఁటును రేలఁ;
కఱచె నేమొ యోగకళను లెస్స. 262

ఆ. తరుణి హస్తనాడిఁ బరికించి తరుణుండు
"ఆడుచుండె మోహనాడి కడిఁది;
అలరుఁబోఁడి ! దీని కధరామృతంబె మం"
దన్న నిమ్మటంచు నడిగె నగుచు. 263

క. "కమలాఫలములు దె"మ్మని
ప్రమదామణి యడుగ ననెను బతి "నీదు సమీ
పమునఁ గలవుగద; కాంచితి
నిముసము క్రిందటనె? చక్కనివవే మయ్యోఁ." 264

గీ. లేదె చిల్లరబేరంబు లేమ ! యొక్క
ముద్దడుగ మోముఁ ద్రిప్పితి ముడిచి బొమలు;
గంపగుత్తగ నీయ సంకల్పమేని
నట్టులే యిమ్ము; నిస్సంశయముగఁ గొందు. 265

క. నను( దా(కిన నానీలిమ
కనకాంగి! నీకు నంట(గలదనుకొంటే ?
కనకంబు నీలరత్నం
బున( బొదిగిన యపుడె కడి(ది పొలుపు వహించున్. 266

క. కొఱుకును జక్కెరబొమ్మని;
శరీరమున కొత్తి వ్రేలు స్వాద మొనర్చున్;
దరుణుండు దనివి దీఱక
మరల( గొఱుకు; నాస్వదించు మరలన్ నగుచున్. 267

క. పులుగడిగిన ముత్తెమువలె
మెలంత యభ్యంగమాడి మెయితళతళతో
నిలువంగ సానపెట్టిన
యలరువిలుతు చికిలివా(డియ మ్మనవచ్చున్. 268

క. పదినెలలు పెద్ద; వావికి
వదినె; విలాసవతి; నవయువకులకు( గనువిం;
దిదివఱకు మఱ(దినైనను
ముదితకు నే బావనైతి మొన్నటినుండిన్. 269

క. వెలి(గింపని దీపము నా
నెలవునకును, వాడిపోవని ప్రసూనము పు
వ్వులతో(టకు; మాయని రం
గుల బొమ్మయు( జిత్రశాలకు లతాంగి యగున్. 270

క. తళతళలాడు తనూలత;
కళకళలాడెడు మొగంబు; గలగల గజ్జెల్;

కిలకిల నవ్వులు; బాలా!
తలఁతు రతికి సవతివగుదు తప్పక యనుచున్. 271

గీ. తరుణి ముత్తైదువులఁగూడి యరుగు దెంచి
పేరఁటమునకు నట గోడ వ్రేలుచున్న
గేస్తు చిత్తర్వువంక వీక్షించు చయ్యొ
జిత్తరువు; భృంగకీట విచిత్రసరణి. 272

క. యువతికె రత్యానందం
బవుఁ బురుషునికన్న నధికమఁట; బ్రహ్మానం
దవిభూతి నొందఁగల దది
దివసంబులఁ; బురుషునకది దవీయమహో! 273

క. నలుగురు నగినన్ నగనీ;
యళుకను; సిగ్గొందఁ జేసినట్టిపనికి నే
నలఁతియు; "స్త్రీరత్నం దు
ష్కులా"దపి యటన్న విబుధసూక్తి నడచితిన్. 274

క. "నలుపెక్కుచుండెఁ జూచుక
ములు; బలియుచునుండెఁ గొను ముదితా!" యని నేఁ
బలుకఁగఁ, జెలి "మీ పురుషుల
చెలికారం బెట్టి నేఁగినేయ?"దని నగెన్. 275

గీ. అఱిగిపోవునె? ముద్దీయ నలరుఁబోఁడి!
అధరబింబంబుఁ జెక్కిళ్లు నంద నీవు;
తఱిగిపోవునె యంటఁదందంబులెల్లఁ?
గౌఁగిలీయక ముడుఁతువు గాత్రలతను. 276

ఆ. వెలదివేసమూని పేరంటమునకేగి
కలిసి రాచుకొనుచుఁ జెలులతోడఁ
బులకరింప నొడలు, మోముఁదమ్మి సెమర్పఁ
దొలఁగు విటుఁడు; వచ్చి కలియు మరల. 277

క. "నవకుసుమకోమలాంగివి
యువతీ! కర్కశము నీదు నురమొకటె" యనన్
నవలా నవ్వుచు "లావ
ణ్యవిలాసము గరుడుగట్టె నచ్చో" ననియెన్. 278

క. ఎదురైతిమి నడివీథినిఁ;
బదములవడి దగ్గ్రాల వదనములుఁ గడుం
గదియుదుము; కేల్కుదింతుము;
ఒదుగుదు; మఱకంటఁజూతు; మొఁడొరులఁ దమిన్. 279

క. విరిఁబోఁడి పణ్యపీథికి
నరుగంగా నహమహమిక నాపణికులు త
త్సరసాపాంగకమూల్యముఁ
బరిగ్రహించి యొసఁగుదురు వలసిన సరకుల్. 280

గీ. నీలరత్నంబుగలదు; కానీ ధరిత్రిఁ
గలదొకో? పీతరత్నంబు; కాంచనాంగి
సుందరీరత్నమగునె? తత్సూక్తిపాత్ర
మరయ నీ కోమలశ్యామలాంగిగాక. 281

క. అఱతలుపుచాటుగా నా
తరుణి నిలిచి వీథివైపు దరిసించుఁ దగన్

చిఱుమొగిలితునుకచాటున
నఱచందురుచిన్ని రేకయన శోభిలుచున్.   28[illegible]

క. అనుదినముఁ దోఁటకరుగుచుఁ
గనరా కెవ్వరికి బాలిక మనోజ్ఞములై
కనవచ్చు దబ్బపండ్లను
జనుంగవను గొలుచుకొనుచు సంతసమొందున్.   28[illegible]

క. తన కొమ్మ పూలగుత్తులు
దినదినమును బథికతతి చిదిమి చెఱతురటం
చును గినిసి యఱచు గృహపతి;
కినిసినకాలఁదియును జిదిమి కేరింత్రతనిన్.   284

క. తమిమై నంగకరన్యా
సములఁ దెలిపి ప్రియుఁడు ప్రియకు శయనీయాగా
రమున నుపదేశమిడె "ఓం
నమో భగవతే స్మరాయ" నా మంత్రంబున్.   285

క. తరుణీ! యొప్పులకుప్పవు;
కురూపి, గుణహీనుఁ, డకులగోత్రుఁడు పతి కె
వ్వరు నినుఁగట్టిరి? చీ! చీ
పురుకట్టకుఁ బట్టుదారమును గట్టినటుల్?   286

క. అఱుగందీయఁ దలంచితె?
వరవర్ణిని! ముందు, వెనుకఁ, బార్శ్వముల ననున్
నిరతంబు రాచుకొంచునె
తిరుగుదు చనుమొనలు లెస్స దిగగ్రుచ్చుచిటుల్?   287

ఆ. "తరువు నాశ్రయింపఁ దమకించు లతకూన;
లతిక నట్లుగాదు క్షితిజ"మనుచుఁ
జెలువుఁ, దనియెఁ జెలువ "నిలువలేకయ తరుల్
కొమలుసాఁచి వేఁడుకొనును లతల." 288

గీ. నిలిచి మా ముంగిట నెలంతఁ బిలుచుచుండఁ
బలికి యా పేరి యెదురింటి వన్నెలాఁడి
తెఱచి తలుపానుకొని నిల్చె దృష్టిఁ ద్రిప్ప
కదుకుకొనిపోయెనో యేమొ ! కదలదయ్యె. 289

గీ. సుదతి యధరామృతము పేరి చొక్కుమందుఁ
ద్రావఁగాఁ జేసి తనదు గాత్రలత పేరి
మరులుఁదీఁగెను ద్రొక్కించె ; నెఱుఁగనైతి
దాని పిమ్మట జరిగిన తంతదెల్ల. 290

క. తగఁ గులసతులు సువాసిను
లుగ మనఁగాఁ గోరుకొంద్రు లోకంబున మా
వగ భోగకాంతలైననె
నెగడుదురు సదా సువాసినీత్వముతోడన్. 291

క. ధరియించిన జిలుఁగుపయిం
దరుణీమణి సొబఁగు మేనితళుకులగమి పె
ల్లుఱుకంగఁ జాలె కప్పిన
సురుచిరమగు పసిఁడిబొమ్మ శోభ వహించున్. 292

క. "దినమును నిశవలెఁ దనప
త్యనుస్మృతి సతికిల సనాతనాచారంబం

టిని"; "విపరీతమె యీ యుగ
మున శిష్టాచార" మంచు ముద్దియ నవ్వెన్.  293

క. అలకలు సెదరెను; విరిసెను
దల జార్ముడి; మెయి సెమర్చెః స్తనయుగ మదరెన్;
మెలమెల్ల వ్రాలుచుంటివి
చెలి! నేలను విడిచి సాముచేయుట చాలున్.  294

ఆ. అదుపులేకొ? యడ్డమాఁకలు లేకయో?
కొమ్మ! నీదు తొమ్మి క్రొవ్వెనంటి;
అతివ "మదన కదనమందు మార్కొను జెట్టి
కగుదు నీకు నుజ్జి" నంచు నవ్వె.  295

క. ఒకనాఁడు ఘూర్జరాంగన;
యొక దినమునఁ బారసీక యువతీమణి; వే
ఱొకనాఁడు యవనసుందరి;
ఒకొక్క యవతారమునఁ బ్రియుం జెలి కలఁచున్.  296

ఆ. ధూర్తవిటుఁడువోలె దుడుకుగాడుపు రేఁగి
బట్టబయల నొడిసి పయఁట దుయ్యు,
ముడిచి బొమలు దొట్రువడు చింతి యొయ్యార
మొలుక సరుదు; మరల నొడియు; సరుదు.  297

గీ. క్రొత్తచీర ధరించినఁ గ్రొత్తరయికఁ
దొడుగుకొన్నను సరిక్రొత్త తొడవులేని
గాజులేనియుఁ దాల్చినఁ గానిపించు
వచ్చి మాయింటి కిరుగింటిపడఁతి మొదట.  298

గీ. ముదిత సర్వాంగలావణ్యమును బ్రియుండు
గనఁగఁ దనివోక దానిచుట్టును జరించు ;
నాననోరోజములు గానరానిరీతి
స్వప్రదక్షిణ మొనరించు సతియు నగుచు. 299

క. నెఱి విరియు నెమిలిపురితో
సరియన జడయూడి కురులు జాఱఁ బొడవులై
పిఱుఁదులమీఁదికి, సుందరి
చరించును వసంతలక్ష్మిచాయను దోఁటన్. 300

ఆ. మలుపు దిరుగుదాఁక నిలిచి వాఁకిట నన్నుఁ
గాంచు రెప్పవాల్పకయ లతాంగి ;
తిరిగి తిరిగి వెనుకదెసఁ గాంచుచట ముందు
కడుగు సాఁగ కెట్లొ ! నడచిపోదు. 301

గీ. అతని కాకులలోన రావాకొకండె,
తొనలలోన మనోజ్ఞమౌ పనసతొలయె,
ఫలగణంబున నారంగఫలములె యగుఁ
బూలలో మేలితామర పూవె ప్రియము. 302

క. చెలి ముంగిట స్వాగతమిడి
యలరులవలిసురఁటి వీఁచి యడఁచి బడలికల్
తలకట్టు దువ్వి నా మో
ము లలిం దీఱిచి పెనంగి ముద్దాడు నన్నన్. 303

గీ. ప్రథమ కేళీరుచిం గొన్న పడుచులకవ
"క్రుంకునో? క్రుంకఁదో? యింకఁ బ్రొద్దు నేఁడు

అక్కటకటా ! రాత్రి త్రియామయయ్యెఁ
గాద బహుయామ" యని యెదం గాసిఁబడియె. 304

క. "ననుఁ గనుదే" లని ప్రతివే
శిని కల్లగఁ గసరఁ, "దొలుతఁ జెలి! నీవె ననుం
గనకున్న నేను నిన్నుం
గను టెట్లెటిఁగితి ?" వటన్నఁ గలకల నవ్వెన్. 305

క. తొలినాఁటిది సరిపడదో ?
మలినాఁటికిఁ; జాలదేమొ ? మఱునాఁటికి న
మ్మలినాఁటిది ; క్రొంగ్రొత్తవి
లలనామణి తొడుగు రవికలం బ్రతిదినమున్. 306

క. "కదురువలెనుంటి వింతకు
మొద ; లిప్పుడు గుదురవైతి ముదితా ! యేలం"
చు దయితుఁడన నవ్వెను జెలి
"త్వదధర సుధఁ ద్రావుచుంట బలిసితి" నంచున్. 307

క. తడికలఁ దూఱుచు, గోడకుఁ
బొడుచుచుఁ గన్నంబుఁ, ద్రోసిపోవుచు మిద్దెల్
పడఁతుక చూపులు ప్రియుపైఁ
బడుచుండును శబ్దవేధి బాణముల వలెన్. 308

క. గునుపేటికి ? కొమ్మా ! 'న
ల్లనిదాన' నటంచు ; రాత్రులఁ దమంబందున్
బెనుమసి హరినీలము వలెఁ
గనంబడక సంచరింపఁ గడు ననువుగదే ! 309

ఆ. మాతృభాషతోనె మగనితోఁ, బ్రియునితో
నాడు గూఢభాషతోడ నెదుట
"మాతృభాష పూత మగని కర్హ౦ం; బన్య
భాష పెఱల" కనుచుఁ బడఁతి పలుకు. 310

గీ. జరిగెఁ దా నాసనమున నాకొఱకె యనుచు
నా రమణి డాసి ప్రక్కనే కూరుచుంటిఁ;
"జిలుకయుం గోరువంకయు వలెను వీరు
పొలిచి" రని మమ్ముఁ గాంచి నల్వురుఁ బొగడిరి. 311

గీ. చక్కఁదనమునకుం దోడు చిక్కఁదనము
గలిగి సుందరి కందర్ప కదనములను
నలిగియును లెస్సగనరాదు నలిగినట్లు
పట్టుకుచ్చన; నుత్సాహవతిగ మెఱయు. 312

క. జిలుఁగంటఁగ మైదీఁగకుఁ
గొలఁకున నీరాడి ముద్దుగుమ్మ రసముఁ బె
ల్లొలికించు స్వ సర్వాంగం
బులు సూపుచు బోయె నాఁచి పురుషుల యెడఁదల్. 313

క. "తల దువ్వితి విపుడే కద!
కలికీ! జడ పెరిగె; నలిగె గండంబులు; గం
టులువడె వాతెఱ: కా దీ
జిలుంగు నీ"; దనుసఖిఁ జెలి "చిలిపి" వని నగెఁ. 314

గీ. కలికి రతనంబు రైకఁ జంకలకుఁ దొడిగి
ననుఁ గనుచు గుబ్బలమరించుకొనుచు నిలిచె

